# ఉద్యోగాల బానిసత్వాన్ని కాదు

## ఋషుల వారసత్వాన్ని పొందండి





mohan PUBLICATIONS

Mohanpublication.com

Granthanidhi.blogspot.in

# ఉద్యోగాల బానిసత్వాన్ని కాదు ఋషుల వారసత్వాన్ని పొందండి

16.4.03 న చైత్ర పౌర్ణమ సందర్భంగా
శ్రీ మారెళ్ళ విశ్వనాధ్‌గారి ఆధ్వర్యంలో
గుంటూరు, సప్తఋషి ఆశ్రమంలో జరిగిన
సాధనా శిబిరంలో మాస్టరుగారు ఇచ్చిన ఉపన్యాసము.

భూమి మీద ప్రతీ అడుగును వీక్షించగలననే సైన్స్, బిన్ లాడెన్, సద్దాం హుస్సేన్‌లు ఎక్కడున్నారో మాత్రం చెప్పలేదు.

ముసలితనాన్ని జయించేస్తాం, డి.ఎన్.ఏ.ని పట్టేసుకున్నాం అని చెప్పే సైన్స్, కేన్సర్, ఎయిడ్స్, సార్స్‌లాంటి రోగాల్ని మాత్రం తగ్గించలేదు.

ప్రకృతిని కొల్లగొడుతూ భూమిని కాలుష్యమయం చేసిన సైన్స్, వర్షాలు కురవక కరువు ఏర్పడితే ప్రజల్ని మాత్రం ఆదుకోలేదు.

బ్రహ్మవిద్యాపారంగతులైన మన యోగులు పై సమస్యల్ని పరిష్కరించగలరు అనే విశ్వాసం మనకు ఉంటే, మన ప్రయత్నాలు ఋషుల వారసత్వం అయిన యోగవిద్యను నేర్చుకునే దిశలో సాగటమే మంచిదేమో!

సీతారాముడు



డా॥ మారెళ్ళ శ్రీరామకృష్ణ, M.Sc., Ph.D.
సెల్ ఫోన్ నెం. 98491 11190

# ఒక సవాల్!

నేడు మానవజాతి మొత్తము ఒక విలక్షణమైన ఆంతరిక, బాహ్య పరిస్థితులలో చిక్కుకొని ఉన్నది. "బాహ్య పరిస్థితులన్నీ కూడా ఆంతరిక మనోభూమి యొక్క ప్రతిబింబాలే" అనేది మనము ఎంత తొందరగా అర్థం చేసుకుంటే అంత మంచిది. అన్ని చిక్కు పరిస్థితుల నుండి బయటపడటానికి ఈ సూత్రము ఉపయోగపడు తుంది. ఈ సూత్రము మీదే సంపూర్ణ ఆధ్యాత్మికత ఆధారపడివుంది.

ప్రస్తుత పరిస్థితులు మానవజాతికి ప్రకృతి ద్వారా ఇవ్వబడు తున్న ఒక సవాల్! ఎప్పుడూ సమర్థునికే సవాల్ ఇవ్వబడుతుంది. ఈ సవాల్ ప్రకృతి సంపూర్ణ మానవజాతికి ఇస్తున్నది కనుక మానవ జాతి మొత్తం దీనిని కలిసి స్వీకరించాలి. ఈ విషయం పరిపూర్ణమైన అవగాహనలోకి తెచ్చుకోవాలి.

రవాణా సౌకర్యాల వేగములో పెరుగుదల, కమ్యూనికేషన్స్ లోని తక్షణం అందజేయగల సామర్థ్యంలోని పెంపుదల (ఎస్.టి.డి., ఐ.ఎస్.డి., ఇంటర్నెట్) మొదలగు బాహ్య పరిస్థితులు, ఆంతరిక




పరిస్థితుల యొక్క ప్రతిబింబాలు అనే సూత్రానుసారం మానవజాతి ఒకే లక్ష్యము కొరకు సంఘటితమై పనిచేయవలసిన తరుణం ఆసన్నమైనదని తెలుపుతున్నాయి. మతాలు, ధర్మాలు, కులాల జోలికి వెళ్ళకుండా మానవజాతి సాధించవలసిన గమ్యమును ఐదు మాటలలో స్పష్టంగా ఏ విధమైన గందరగోళం లేకుండా నిర్వచించ వచ్చును. అదే ఒకే విశ్వం, ఒకే శక్తి, ఒకే ధర్మం, ఒకే భాష, ఒకే కరెన్సీ (ఒకే వినిమయ సాధనము)గా మనం గుర్తించాలి. ఈ పరిస్థితులు ఏర్పరచగలమా? ఈ సవాల్ స్వీకరించడానికి ప్రబల పురుషార్థము చేయగలవారికి ఈ పుస్తకం ఉపయోగపడుతుంది.





ఓం ............... ఓం .............. ఓం ..............

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మః తస్మై శ్రీగురవేనమః

అఖండమండలాకారం వ్యాప్తంయేన చరాచరమ్
యత్పదం దర్శితంయేన తస్మై శ్రీగురవేనమః

---

యుగయుగాలుగా ప్రపంచంలో, ముఖ్యంగా భారత దేశంలో విస్తృతంగా నేర్పబడుతోన్నటువంటి ఆధ్యాత్మిక విద్యలో ఉన్నటువంటి కొన్ని రహస్యాలు మీరు తెలుసుకోండి.

✦ రహస్యాలు కనుక సహజంగానే దానిని అర్థం చేసుకోవటానికి మీరు కాస్త ఏకాగ్రతతో జాగ్రత్తగా వినాలి.

జాగ్రత్తగా వింటే అర్థం కానిది అంటూ ఏం ఉండదక్కడ. కానీ మామూలు మానసికస్థితితో కాకుండా, ఒక విశేషమైనటువంటి

విద్య గురించి, అది మనకు ఏమి చెప్తోందో తెలుసుకోవటం గురించి ఒక పరిపూర్ణమైనటువంటి అవగాహన మీరు ఇవాళ ఏర్పరచుకుంటే,

రాబోయేటటువంటి రోజులలో మీరు ప్రపంచానికే
మార్గదర్శకులుగా కాగలరు.

నేను మళ్ళీ మళ్ళీ ఈ విషయాన్ని చెప్తున్నాను. మీరు దాన్ని చాలా సీరియస్‌గా తీసుకోండి.

***ఎందుకంటే,***

దీనిని సీరియస్‌గా తీసుకున్నటువంటి వ్యక్తులు రాబోయే టటువంటి 10 సంవత్సరాలలో ప్రపంచంలో విశేషమైనటువంటి పేరు సంపాదించుకోగలరు.

వివేకానందకి ఎంత పేరు వచ్చిందో,
అంతకంటే ఎక్కువ పేరు మీకు వస్తుంది.

కానీ దాన్ని అధ్యయనం చేస్తే. ఆషామాషీగా విని వెళ్ళిపోతే కాదు. అంచేత నేను చెప్పేటటువంటి ఈ మాటలను కాస్త చాలా సీరియస్‌గా వినండి. ప్రొద్దున్న నేను మీకు ఒక సంవత్సర ప్రణాళిక ఇచ్చాను. 2004లో జూన్‌లో జరగబోయేటటువంటి కృష్ణా పుష్కరాలు లోపల మీరు నేర్చుకోవలసిన విషయాలు నేను మీకు చెప్పాను. అదేమిటి? సామూహికంగా మీరు చేయవలసింది.

గురుదేవులు యొక్క జీవితంలో
ఆయనకి ఒక తీరని కోరిక మిగిలిపోయింది.
దానికి చాలా సార్లు ఆయన ప్రయత్నం చేశారు.



**ఆయన చేసినటువంటి ప్రయత్నం ఏమిటంటే,**

తక్షశిల, నలందా స్థాయిలో
హరిద్వార్‌లో ఒక విశ్వవిద్యాలయం స్థాపించాలి అని.

**ఎందుకంటే,**

ప్రొద్దున్న మాట్లాడుతూ నేను మీకు ఒక ప్రశ్న వేశాను. రవాణా సౌకర్యాలు, కమ్యూనికేషన్స్, ఈ టెలిఫోన్స్, వెబ్‌సైట్స్, సెల్‌ఫోన్స్ లేనటువంటి రోజులలో కూడా భారతదేశంలో ఇంత సంపద ఉంది అని విదేశీయులకి ఎలా తెలిసింది?

కొల్లగొట్టటానికి వచ్చారు. కానీ వాళ్ళు రావటానికి సులువైన మార్గం లేదు. చాలా కష్టపడిరావాలి.

అంత కష్టపడి రావటానికి వాళ్ళు ఎందుకు రెడీ అయ్యారు?
భారతదేశంలో అంత సంపద ఉందని వాళ్ళకి నమ్మకం ఏమిటి?

**దానికి కారణం ఏమిటంటే,**

భారతదేశంలో తక్షశిల, నలందా విశ్వవిద్యాలయాలు ఉండటం. అవి మామూలు ఈనాడు మనం అనుకుంటోన్నటువంటి విశ్వవిద్యాలయాలు కాదు. ఆధ్యాత్మిక కేంద్రాలు.

- ఆ ఆధ్యాత్మిక శక్తి కేంద్రాలలో విద్య నేర్చుకున్న ఒకొక్క వ్యక్తి, ఒకొక్క దేశానికి వెళ్ళి ఆ దేశాన్ని తమ యొక్క జ్ఞానంతో వాళ్ళు లోబర్చుకున్నారు. మనం ఎవరి మీదా యుద్ధం ప్రకటించలేదు. కానీ మన దేశంలో ఉన్న ఆధ్యాత్మిక సంపద, కమ్యూనికేషన్స్ లేని ఆ రోజులో సహజంగా ప్రపంచం అంతా విస్తరించింది.

❋ కానీ ఈనాడు, ఇంత కమ్యూనికేషన్స్ ఉన్నటువంటి రోజులలో ఆధ్యాత్మిక విద్య మన దేశంలోనే ఎక్కడా కనిపించటం లేదు.

**దానికి కారణం ఏమిటంటే,**

ఆధ్యాత్మిక విద్య అంటే ఏమిటో మనకి తెలియదు.

ఇంజనీరింగ్ చదువుతున్నటువంటి వాడికి మందులు ఇవ్వటం వస్తుంది అని నేను చెప్పాననుకోండి, ఒప్పుకుంటారా?

"మీకు తెలుసా ఇంజనీరింగ్ చదువుతున్నాడు మావాడు, ఇంజనీరింగ్ అయిపోగానే వాడు మీకు మందులు వేస్తాడుట" అంటే మీరు ఏం అంటారు వాడ్ని? పిచ్చివాడు అంటారుగా!

❋ కానీ మనం ఇంజనీరింగ్ చదవలేదుగా? మనం డాక్టర్లం కాదుగా? అయినా ఇంజనీరింగ్‌లో ఏం చెప్పబడుతుందో, వైద్య వృత్తిలో ఏం చెప్పబడుతుందో మీకు తెలుసుకదా!

**నేను చెప్పింది అర్థమవుతోందా?**

చాలా జాగ్రత్తగా అర్థం చేసుకోండి. కొన్ని రహస్యాలు నేను మీకు ఇవాళ చెప్పబోతున్నాను. మనం ఇంజనీర్లంకాదు, మనం డాక్టర్లం కాదు. కానీ ఎవడైనా ఇంజనీరింగ్ చదువుతున్నాడు అంటే, వాడు కచ్చితంగా మందులు ఇవ్వడు అని మనకు తెలుసు. ఎవడైనా ఎమ్.బి.బి.యస్., మెడికల్ కోర్సు చదువుతున్నాడు అంటే, కచ్చితంగా వాడు బిల్డింగ్స్ కట్టడు అని తెలుసు.

❋ అంటే ఆ విద్య నేర్చుకోకపోయినా, ఆ విద్య గురించి మనకి పరిపూర్ణమైనటువంటి అవగాహన ఉన్నది.



- కానీ ఆధ్యాత్మిక విద్యలో మనం ఏం నేర్చుకోవాలి అనేటటు వంటి అవగాహన మనకు లేదు.
- తక్షశిల, నలందా యూనివర్సిటీస్‌లో ఆ అవగాహన ఉండేది. కానీ ఆ అవగాహన వచ్చినా మీరు ఆధ్యాత్మిక ఋషులు కావలసిన అవసరంలేదు.

మనం ఇంజనీర్స్ కాకపోయినా ఇంజనీరింగ్‌లో ఏం చెప్తారో తెలుసు. డాక్టర్స్ కాకపోయినా మెడికల్ టెక్నాలజీలో ఏం నేర్పబడు తుందో మనకి తెలుసు. కదా! అదేవిధంగా ఆధ్యాత్మిక విద్య గురించి ఒక అవగాహనకి మనం రావాలి ఈ రోజు.

**ఆధ్యాత్మిక విద్యలో మనకి చెప్పబడేది ఏమిటి?**

- ఏ ఒక్క విషయం తెలిస్తే ఇంక మీరు ఏ విద్యనూ నేర్చుకోవలసిన అవసరము లేదో, ఆ విద్య ఆధ్యాత్మిక విద్య.
- ఏ ఒక్క విద్య మనకి తెలిస్తే, ఇంక మనము ఏ విద్యనూ అభ్యసించవలసినటువంటి అవసరము లేదో, ఆ విద్యను ఆధ్యాత్మిక విద్య అంటారు.

మళ్ళీ జాగ్రత్తగా వినండి, మననం చేసుకోండి ఏం చెప్పానో.

- ఆధ్యాత్మిక విద్య ఒక్కటి మీకు తెలుస్తే, ఇంక మీరు ప్రపంచంలో మిగతా ఏ విద్యలూ కూడా నేర్చుకోవక్కర్లేదు.
- అందుకని రాబోయేటటువంటి కాలంలో ఈ విద్య తప్ప ఇంక ప్రపంచంలో ఏ విద్యలూ ఉండవు. కారణం అది.



**ఎంచేతంటే,**

మీకు అన్ని విషయాలూ తెలిసిపోయేటటువంటి విద్య వచ్చేశాక, ఇంక వేరే వేరే విషయాలు మీరు తెలుసుకోవలసినటు వంటి అవసరము లేదు.

మనం ఇంజనీరింగ్ చదవటానికి, మెడికల్ కోర్స్ చదవటానికి, లేకపోతే మిగతా కోర్సులు చదవటానికి, సైంటిస్ట్‌లు అవటానికి లక్షలు లక్షలు ఖర్చుపెడుతున్నాం. ఒక విద్య నేర్చుకోవటానికే. ఆ విద్య వచ్చిన వాడికి మిగతా విద్యలు రావు.

* కానీ ఆధ్యాత్మిక విద్య నేర్చుకుంటే ఈ విద్యలు అన్నీ మీకు వస్తాయి అంటే నేర్చుకోవటానికి మన మనస్సు ఒప్పుకోవటం లేదు. ఎలాంటి స్థితిలో ఉన్నామో, మన మానసికస్థితిని కొంచెం అర్థం చేసుకోండి.

✦ మీరు అద్భుతమైనటువంటి ఇంజనీర్స్ అవుతారు. కోతులు చేత వారధి కట్టించాడు. మనుష్యుల చేత కాదు, ఇంజనీర్స్ చేత కాదు.

✦ ఒక గడ్డిపోచ తీసుకుని ఈ గడ్డిపోచ ఫలానా వాడి ప్రాణం తీసెయ్యాలి అని చెప్తే, వాడు ప్రపంచంలో భూమి మీదే కాదు, ఇతర లోకాలకి వెళ్ళినా కూడా చచ్చాడే వాడు.

ఒక గడ్డిపోచను అస్త్రంగా మార్చగలిగేటటువంటి శక్తి!

**ఆ శక్తిని నేర్చుకోవాలని ఎందుకు అన్పించటంలేదు మనకి?**



మా వాడు ఇంజనీర్ అయిపోవాలి!

మా వాడు డాక్టరయిపోవాలి!

మా వాడు అడుక్కుతినాలి!

**ఎంచేతంటే,**

వాడు ఇంజనీర్ అయినా, డాక్టర్ అయినా అడుక్కుని తినాల్సిందే.

**ఏం అడుక్కోవాలి అంటే,**

ఉద్యోగం అడుక్కోవాలి.

కానీ అందరూ అడుక్కుని తింటున్నారు కనుక
మనకు సిగ్గు అన్పించటం లేదు.

**మరి అయితే మాస్టారు ఏం చేయాలి?**

✦ ఈ విద్య నేర్చుకుంటే, ఈ విద్యని ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నటువంటి, మనలో ఉన్నటువంటి, ఈ మాటలు వింటూవున్నటువంటి వ్యక్తులలో ఒక పది మంది అయినా నేర్చుకోగలిగితే,

వాళ్ల ద్వారా రాబోయేటటువంటి 10 సంవత్సరాలలో
ఈ విద్య మొత్తం పాకిపోతుంది. మొదట నేర్చుకున్న వాళ్లకే
కష్టంకాని, తరవాత వాళ్లకి కష్టం ఏమీ ఉండదు.

☺ మీరేదో బ్రహ్మాస్త్రం గురించి చెప్తున్నారు, ఇప్పుడు ఎవడికి వచ్చునండి బ్రహ్మాస్త్రం వేయటం? మీరేదో కోతులు వారధి కట్టాయంటున్నారు, ఇప్పుడు అవి ఎలా జరుగుతున్నాయండి?

**పోనీ ఇప్పటి సంగతి మనం ఆలోచిద్దాం!**

నెల్లూరు జిల్లాలో ఒక పిచ్చివాడు ఉండేవాడు. నెల్లూరు గవర్నమెంట్ హాస్పిటల్‌లో ఐదేళ్ళ ఒక పాపకి ఏదో తెలియనటువంటి జబ్బు. కడుపు బాగా ఒక బెలూన్‌లాగ ఉబ్బిపోయింది. లివర్ ట్రబుల్ అని డాక్టర్లు చెప్పారు. రక్తం పాడైపోవటం వల్ల ఒళ్ళంతా నల్లబడి పోయింది. సరే మళ్ళా రక్తం మార్చాలన్నారు, మార్చారు. ఒక నెల తరవాత మళ్ళా అదే పరిస్థితి. డాక్టర్లు మేమేమీ చేయలేము, అయి పోయింది అన్నారు.

ఆ పాపను తీసుకుని తల్లితండ్రులు చాలా బాధతో హాస్పిటల్ బయటకి వస్తున్నారు. ఇంతలో ఆ హాస్పిటల్‌లో సర్వీస్ చేసే ఒక వార్డ్‌బోయ్, "ఇక్కడకి దగ్గరలోనే గొరగనమూడిలో ఒక వ్యక్తి ఉన్నాడు. ఎక్కువ మంది ఆయనని పిచ్చివాడు అంటారు. నా ఉద్దేశ్యం కూడా అదే. కానీ మీ అదృష్టం పరీక్షించుకోండి. తీసుకెళ్ళండి వాడి దగ్గరకి" అన్నాడు.

డాక్టర్లు చెప్పేశారుకదా, ఇంక మేమేమీ చేయలేము అని. ఇంకొక రెండు రోజులో, మూడు రోజులో ఉంటుందేమో ఆ పాపకి ప్రాణం. అప్పుడు ఆయన దగ్గరకి తీసుకెళ్ళారు.

తీసుకెళితే వాడు పిచ్చివాడుకదా! ముందే చెప్పారు వాడు పిచ్చివాడని. వాడేం చేశాడు? తన కుడికాలు ఎత్తాడు. ఆ పాప యొక్క బొడ్డుని గట్టిగా నొక్కాడు. రెండు రోజుల్లో పోతుందనుకున్న ప్రాణం అప్పుడే పోయిందనుకున్నారు ఆ తల్లితండ్రులు. "మన పిచ్చికాని, ఒక పిచ్చివాడి దగ్గరకి డాక్టర్లు, ఎమ్.డి.లు, ఎమ్.ఎస్.లు నయం

చేయలేనటువంటి ఆ వ్యాధిని వీడు నయం చేస్తాడనుకుని మనం రావటం ఏమిటి?" ఆ పాప మరి బాధపడింది, కెవ్వుమని అరిచింది. కళ్ళల్లోంచి, చెవుల్లోంచి, నాసికారంధ్రాల్లోంచి, నోటి లోంచి, మలద్వారం నుంచి నల్లటి రక్తము కారటం మొదలెట్టింది. వీడు ఊరుకుంటేకదా, పిచ్చివాడుకదా, ఇంకా నొక్కుతున్నాడు.

పాప అరుస్తోంది. ఏం చేయటానికీ వీళ్ళకి ధైర్యం చాలటం లేదు. కింకర్తవ్య విమూఢులైపోయారు. ఏం చేయాలనే కన్ఫ్యూజన్ వచ్చేసింది. లేకపోతే లాక్కుని పోదురేమో! పిల్ల అదృష్టము, వాళ్ళకి తట్టలేదు ఏం చేయాలో. సరే అలాగ నొక్కిన తరవాత, ఆ నల్లటి నెత్తురు రావటం మానేసిన తరవాత "స్నానం చేయించి వేరుశనగ పప్పులు బాగా పెట్టండి" అన్నాడు.

- ఆయన దగ్గర ఉన్న వాళ్ళకి గురువు చెప్పిందే చేయటం తప్ప, గురువు ఎందుకలా చేస్తున్నాడని ఆలోచించే అలవాటు లేదు.
- మనం చేసేటటువంటి చాలా పెద్ద తప్పు ఏమిటంటే, గురువు ఆ పని ఎందుకు చేస్తున్నాడో తెలిసిపోయిందనుకుంటాం.

  గురువు ఎందుకు, ఏది చేస్తున్నాడో మీకు తెలిస్తే, దయచేసి ఆ గురువు దగ్గరకి వెళ్ళకండి.

**ఎంచేతంటే,**

వాడు ఎందుకు చేస్తున్నాడో మీకు ఆల్రెడీ తెలిసిపోయింది.

**మీకు తెలియదు. తెలియటం అసంభవం మీకు.**

అంచేత కేవలం విశ్వాసం ఉంచుకోవాలంతే.

***అందుకే సాయి అనేవాడు,***

మీకు నిష్ఠ ఉండాలి, విశ్వాసం ఉండాలి.

అంతేతప్ప, డాక్టర్లు ఏమీ చేయలేకపోయారు, వీడేమో బొడ్డు నొక్కేస్తున్నాడు, నల్లటి నెత్తురొచ్చేస్తోంది, పాప చచ్చిపోతుంది అనుకుంటే నువ్వేమీ చేయలేవు.

సరే వేరుశనగ పప్పులు పెట్టారు. మూడు రోజులు తరవాత పూర్తిగా తగ్గిపోయింది. తగ్గిపోయిన తరవాత ఆ డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళారు. పాపను మార్చేశారు, తగ్గటం అసంభవం అన్నారట వాళ్ళు. ఈ కాలంలో జరిగినటువంటి సంఘటనే ఇది.

***అంటే మనకి ఆధ్యాత్మిక విద్య గురించి ఉన్న అవగాహన ఏమిటంటే,***

పిచ్చివాళ్ళు! పిచ్చి వెంకయ్యస్వామి గురించి చెప్తున్నాను.

***కానీ తరవాత ఆ పిచ్చివాడ్ని ఏమన్నారు మీరు?***

"భగవాన్ వెంకయ్యస్వామి" అన్నారు.

అంచేత ఈ మాటలన్నీ వింటానికి మీరు అక్కడకి వెళ్ళారు, పిచ్చివాళ్ళు మీరు, ఎందుకు వెళ్ళారు అని మిమ్మల్ని అన్నారనుకోండి, మీరు అదృష్టవంతులు.

***ఎందుకు అదృష్టవంతులు?***

పిచ్చివాళ్ళు అన్పించుకున్నారుకదా! ఇంక గ్యారంటీగా రేపు మీరందరూ ఏమైపోతారు? .........



ఈ కాలానికి సంబంధించిందే ఇంకొక సంఘటనలో ఏమైందో చూద్దాం. మెహర్‌బాబా పేరు మీరు వినేవుంటారు. ఆయన దగ్గరకి ఇరవయ్యేళ్ళ యువకుడ్ని తీసుకొచ్చారు. ఆ యువకుడికి గత పది ఏళ్ళగా ఒంటి నిండా కురుపులు, రసి కారుతోంది. ఆ వ్యక్తి ఎక్కడుంటే అక్కడ ఆ వ్యక్తిని వెతుక్కోవలసి వచ్చేది. ఎంచేతంటే ఈగలు ముసిరిపోయేవి. ఆ వ్యక్తి ఎక్కడున్నాడో చూడాలంటే ముందు ఆ ఈగలు తోలాలి మీరు.

ఎంత జుగుప్సాకరమైనటువంటి పరిస్థితో మీరు ఊహించు కోండి. ఆ ఈగలు అలా ముసురుతూవుంటే వాడి బ్రతుకు ఎలా ఉంటుందో మీరు ఊహించుకోండి. మనకి అసహ్యం మాత్రమే కావచ్చు, కానీ అలా ఈగలు ముసురుతూ బ్రతుకుతోన్నటువంటి వాడి బ్రతుకు ఎలా ఉంటుంది? గత పదేళ్ళగా అలా బాధపడుతున్నా డతను. అటువంటి వ్యక్తిని ఈయన దగ్గరకి తీసుకొచ్చారు.

ఈయనేం పెద్దగా చదువుకోలేదు. ఈ మెహర్‌బాబాగారు ఇంటర్మీడియెట్ చదువుతూవున్నప్పుడు హజరత్ బాబాజాన్ అనేటటువంటి ఒక సూఫీ ఫకీర్ ఆయన్ని నుదిటి మీద ముద్దు పెట్టుకుంది. ఆవిడ ఒక చెట్టు క్రింద కూర్చుని ఉండేది. ముద్దు పెట్టిన తరవాత అతనికి మతిస్థిమితం తప్పింది. బుర్ర గోడకేసి కొట్టేసుకునేవాడు, అలా పదేళ్ళు తిరిగాడు.

అలా తిరుగుతూ శిరిడీసాయి దగ్గరకి వెళ్ళాడు. శిరిడీసాయి దగ్గరకి వెళ్ళిన తరవాత ఆ భ్రమ తగ్గింది. అంత వరకూ పిచ్చివాడు అయిపోయాడు మా పిల్లవాడు అనుకునే ఇంట్లోవాళ్ళు బాధపడ్డారు.

ఆ పిచ్చిది ముద్దు పెట్టుకుంది. ఆమె బాగానే ఉంది కాని, వీడు పిచ్చివాడు అయ్యాడు నా కొడుకని వాళ్ళు ఏడుస్తూనే ఉన్నారు.

సాయి దగ్గరకి వచ్చాక ఆ మతి స్థిమితము కాస్త ఏర్పడింది, పూర్తిగా ఏర్పడలేదు. అలాంటి పరిస్థితుల్లో కొంతమంది ఆయనకి శిష్యులుగా వచ్చారు. అలాంటి పరిస్థితుల్లో బోంబే బయట ఉన్న ఒక రెస్ట్ హౌస్‌లో ఈ సంఘటన జరిగింది. ఈగలు ముసురుతూ వళ్ళంతా కురుపులు ఉన్నటువంటి ఆ ఇరవైయేళ్ళ యువకుణ్ని తీసుకుని వచ్చారు.

"నేను చెప్పింది చేస్తారా?" అన్నాడు.

"చేస్తాం!"

"చేయకపోతే తంతాను" అన్నాడు.

☹ మెహర్‌బాబా నాకు నచ్చిన గురువు. అసలు అలా నేను ఎందుకు అవలేనా అని బాధపడుతూ ఉంటాను. మీరు చేయలేదు అనుకో, తంతాననేవాడు. తన్నేవాడు కూడా.

అంచేత ఆ చుట్టుప్రక్కల ఉన్న ఆయన శిష్యులు చెప్పారు. కానీ మెహర్‌బాబా ప్రేమికులు అంటాడుకాని, శిష్యులు అనేవాడు కాదు. ఆ డివైన్ లవ్. అంచేత మెహర్‌బాబాకి శిష్యులు లేరు, మెహర్‌బాబా యొక్క ప్రేమికులు ఉండేవారు. అంచేత ఆయన దగ్గర ఉన్నటువంటి ప్రేమికులు చెప్పారు, "మీకు తెలీదు, మా వాడు ఉట్టి వెర్రాడు, ఆయన చెప్పింది మీరు చేయలేదనుకో, మిమ్మల్ని చంపుతాడు, గొంతుకు పట్టుకుని పిసికేస్తాడు!"

"పదేళ్ళగా బాధపడుతున్నాం, డాక్టర్లు సెప్టిక్ కండిషన్ అయి పోయిందంటున్నారు. ఇంక కళ్ళు చెవులు కూడా సెప్టిక్ కండిషన్‌లోకి వచ్చేశాయి. కళ్ళు పోతాయి, చెవులు పోతాయి వీడికి. ఇంక వీడు బ్రతికితే ఏమిటి, బ్రతకకపోతే ఏమిటి, జీవశ్చవమే కదా, అందుకని తీసుకొచ్చాం. వినకేం చేస్తాం, మాకు ఇంకో గతి లేదు" అన్నారు.

సరే అయితే ఏం చెప్పాడు, డాక్ బంగ్లా పూర్వకాలంలో ఎలా ఉండేవో మీకు తెలియదు, చాలా పాతబడి ఉండేవి, నీట్‌గా ఏం ఉండేవికాదు. అక్కడ టాయిలెట్లు కడగటానికి ఇనప బ్రష్‌లు ఉండేవి పూర్వకాలంలో. పదేళ్ళ క్రిందట తుప్పట్టిపోయినటువంటి టాయిలెట్ ఇనప బ్రష్ ఒకటి ఉందక్కడ. "అది తీసుకురండి మీరు, బాగా రుద్దేయండి వీడి వంటిని" అన్నాడు.

తుప్పెక్కిన ఒక చిన్న మేకు మనకు గుచ్చుకుంటే టెట్రాయిట్ ఇంజక్షన్‌కి పరిగెడతాం. పదేళ్ళ క్రిందట టాయిలెట్స్ క్లీన్ చేయటానికి ఉపయోగించినటువంటి ఇనప బ్రష్‌తో వాడి మొత్తం వళ్ళుని రుద్దేయండి పఱ పఱ పఱా అన్నాడు.

సరే వాళ్ళు తీసుకొచ్చి, అమ్మనో, నాన్ననో రుద్దమంటే ఎలా రుద్దుతారో వాళ్ళు తెలుసుకదా, అలా అలవోకగా రుద్దుతూవుంటే, అలా కాదయ్యా రుద్దేది, నాకు ఇవ్వండి అని, ఫఱ, ఫఱ రుద్ది పారేశాడు మొత్తం శరీరాన్ని. మూడో రోజు నార్మల్. ఆధ్యాత్మిక విద్య!

అంచేత రెండు ఉదాహరణలు చెప్పారు మాస్టారు, మాకు అర్థమయిపోయింది ట్రిక్కు, అంచేత హాస్పిటల్‌కి వెళ్ళి అందరి రోగులు బొడ్డు నొక్కుతాం! ఇంకా ఈజీ టెక్నిక్ అర్థమయిపోయింది

మాకు, ఇనుపబ్రష్ ఒకటి తెచ్చుకుని అందర్నీ రుద్దుతాం అంటే కుదరదు. మీకు ఆ విద్య తెలియాలి, ఆ అవగాహన తెలియాలి. ఈ కాలపు వాళ్ళే వీళ్ళందరూ.

అంచేత పూర్వకాలంలో మాత్రమే అలాగ జరిగేదని కాదు. ఈ కాలంలో జరిగినా మీకు అర్థమవటంలేదు.

ఇంత అద్భుతమైన శక్తి వాళ్ళకి ఎక్కడ్నుంచి వచ్చింది? మనమూ ఆ విద్య నేర్చుకుందాము అనే తపన రావటం లేదు.

❄ శ్రీరామశర్మ ఆచార్య దగ్గరకి వెళ్ళినప్పుడు గురువు గురించి వెతుకులాట ఆగిపోయింది అని మీకు చాలా సార్లు చెప్పాను.

ఇప్పటికీ నేను అనేక మంది గురువుల దగ్గరకి వెళుతూ వుంటాను, అనేక మందితో నా సంబంధాలు జరుగుతూ వుంటాయి. వాళ్ళు చెప్పేటటువంటి విషయాలు నేను వింటూ వుంటాను.

కానీ, ఈనాటికీ, ఏనాటికి అయినా కూడా శ్రీరామశర్మ ఆచార్య తప్ప ఇంకో గురువు నాకు ఉండడు అనుకుంటాను నేను.

**కానీ ఒకటి,**

ఆయనకంటే గొప్పవాడు కనిపిస్తే గ్యారంటీగా ఆయన్ని వదిలేసి ఇంకొకడ్ని పట్టుకుంటాను.

నాకేమీ మొహమాటం లేదు. కానీ నాకు ఆయనకంటే గొప్పవాడు కనిపించాలి.

కనిపించటం లేదు, అదీ వచ్చిన గొడవ.



## ఎందుకు ఆయనంత గొప్పవాడు?

ఇందాక నేను చెప్పినటువంటి ఉదాహరణలలో ముందు వాళ్ళందరూ పిచ్చివాళ్ళు అన్పించుకున్నారు.

## ఎందుకు పిచ్చివాళ్ళ అన్పించుకున్నారు?

వాళ్ళు నేర్చుకునేటటువంటి విద్యను ఒక పద్ధతి ప్రకారం నేర్చుకోలేదు వాళ్ళు.

పూర్వకాలం సైంటిస్ట్లందరూ కూడా ఒక పద్ధతి ప్రకారం సైంటిఫిక్ డెలివరీ చేయలేదు వాళ్ళు. ఈనాడు ఎలక్ట్రికల్ ఇంజనీర్స్ అందరూ కూడా ఫేరడే చెప్పినటువంటి నియమాలనే పాటిస్తున్నారు. ఫేరడేస్ లాస్ ఆఫ్ ఎలక్ట్రిసిటీ అని పేరు. రెండు నియమాలవి. ఆ ఫేరడే ఎవరంటే బుక్ బైండర్. ఆయనకి సైన్స్ అదీ ఏం రాదు. అంచేత ఈనాడు ఒక బుక్ బైండర్ వచ్చి నేను ఒక నియమాన్ని చెప్తాను అంటే మనం ఏం అంటాం వాడిని? కచ్చితంగా పిచ్చివాడు వీడు, సైన్స్ చదువుకోకుండా వీడొక నియమాన్ని చెప్తానంటే ఎట్టా!

❋ అలాగ ఆధ్యాత్మిక జగత్తులో శ్రీరామశర్మ ఆచార్యకంటే ముందు ఉన్నటువంటి వాళ్ళందరూ కూడా ఒక పద్ధతి ప్రకారము ఆధ్యాత్మిక విద్యను నేర్చుకోలేదు.

పూర్వజన్మ సుకృతం వల్ల, అనేక రకాల కారణాలు ఉంటాయి. ఆ కారణాలన్నీ మనం ఇవాళ చర్చించుకోవక్కర్లేదుకాని, వాళ్ళు ఎంచేత ఆ స్థితికి ఎదిగారు అని ఆ కారణాలన్నీ కూడా రాబోయేటటువంటి రోజుల్లో మీకు తెలియాలి.

***పండిత శ్రీరామశర్మ ఆచార్య దగ్గర ఉన్నటువంటి గొప్పతనం ఏమిటంటే,***

మీరు మామూలు వ్యక్తులుగా జీవిస్తూ, మీరు ఆ స్థితికి వెళ్ళగలరు! మీరు పిచ్చివాళ్ళు అన్పించుకోవక్కర్లేదు! కండిషన్ అది. అన్పించుకోవాలి అంటే, అన్పించుకోకపోతే బావుండదు అనుకుంటే అన్పించుకోండి అది వేరే విషయం.

❄ కానీ ఈ శ్రీరామశర్మ ఆచార్య అనేటటువంటి అద్భుతమైనటు వంటి వ్యక్తి యొక్క ప్రాదుర్భావముతో ఆధ్యాత్మిక విద్యకు ఒక వైజ్ఞానిక స్వరూపం ఏర్పడింది.

పద్ధతి ప్రకారం మీరు నేర్చుకోవచ్చు.

నేను చెప్పేటటువంటి రహస్యం అది. ఆ పద్ధతి ఎలా ఉంటుంది, ఆ పద్ధతి కోసం మీరు ఏం చేయాలి అనేది ఈ పూర్ణిమ నాడు నేను మీకు చెప్పబోతున్నాను.

సైన్స్‌లో మనం శక్తులు గురించి మాట్లాడుకుంటాం.

ఎలక్ట్రిసిటీ ఒక శక్తి, కాంతి ఒక శక్తి, అయస్కాంతము ఒక శక్తి, గురుత్వాకర్షణ శక్తి ఒక శక్తి, హీట్ - వేడి ఒక శక్తి.

ఇవంతా శక్తులే. ఫిజిక్స్‌లో, కెమిస్ట్రీలో వాటిలో ఈ శక్తులు గురించి మనం చదువుకుంటూ ఉంటాం.

✪ ఆధ్యాత్మిక విద్యలో మీరు మూడు శక్తులు గురించి చదువు కుని వాటిని ఉపయోగించుకోవటం నేర్చుకుంటారు. ఆ మూడు శక్తులను "ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి" అంటాం.



జ్ఞానశక్తిని ఎలా ఉపయోగించుకోవాలి?

క్రియాశక్తిని ఎలా ఉపయోగించుకోవాలి?

ఇచ్ఛాశక్తిని ఎలా ఉపయోగించుకోవాలి?

ఈ మూడూ మనం నేర్చుకుంటాం. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి. వీటిని మీరు అవగాహన చేసుకోండి.

చాలా మంది "మేము సాధనలు చేస్తున్నాం, మంత్రజపాలు చేస్తున్నాం. కానీ, మాకు ఫలితాలు రావటంలేదు" అంటారు.

**ఎందుకు రావటం లేదంటే,**

ఈ మూడు శక్తులను ఉపయోగించుకునేటటువంటి విద్య మీరు నేర్చుకోవటంలేదు.

♣ మళ్ళీ అర్థం చేసుకోండి. నేను ప్రొద్దున్న చెప్పినటువంటి గాయత్రీ మంత్రాన్ని త్రిపదా గాయత్రీ అంటాం. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తులనే గాయత్రీ యొక్క మూడు పాదాలు అన్నారు. ఇది మీ మనసులో చాలా జాగ్రత్తగా నాటుకోండి.

**మొదట ఏం చెప్పాన్నేను,**

ఆధ్యాత్మిక విద్య అనగా ఇంకో విద్య మీకు తెలియాల్సిన పనిలేదు. నేను ఇందాక ఇచ్చిన ఉదాహరణలు అంతేకదా! రోగ నివారణ ఎలా చేశారో చెప్పాను.

⌖ ఆధ్యాత్మిక విద్యలో రోగనివారణే కాదు, మిగతా విషయాలు గురించి కూడా తెలుస్తాయి.



వివేకానంద బీహార్‌లో ఒకసారి పర్యటన చేస్తూవున్నప్పుడు, అప్పటికి ఇంకా ఆయన వివేకానంద అనేటటువంటి పేరుగల వ్యక్తిగా మారలేదు. అంటే పిచ్చివాడుగా తిరుగుతున్నాడు. ఎవడూ ఆయన్ని గుర్తించలేదు.

- ఎక్కడైనా నా గురుదేవులు, అంటే, రామకృష్ణ పరమహంస చెప్పినటువంటి విద్యను నేర్చుకోవటానికి ఎవడైనా దొరుకుతాడా అని కన్యాకుమారి నుంచి హిమాలయాల వరకు, హిమాలయాల నుంచి కన్యాకుమారి వరకు మూడు సార్లు పాదయాత్రలు చేశాడాయన.

ఒక్కడు దొరకలేదు ఆయనకి.

ఒక స్టేషన్ మాస్టర్ దొరికాడు, సరే దాని గురించి మనం ఇప్పుడు మాట్లాడుకోవక్కర్లేదు. ఎవరూ దొరకలేదు ఆయనకి. ఆ విద్య నేర్చుకోవటానికి కావలసినటువంటి సాధకుడు ఒక్క వ్యక్తి కూడా దొరకలేదు ఆయనకి.

అటువంటి వ్యక్తి బీహార్‌లో ప్రయాణం చేస్తున్నప్పుడు అప్పటికి గొప్పవాడు వివేకానంద అని తెలియదు. జంషెడ్‌జీ టాటా, టాటానగర్, ఇప్పుడు ప్రోఫిట్‌లో నడుస్తోన్నటువంటి ఏకైక స్టీల్ ప్లాంట్ అదే అనుకుంటాను. వివేకానంద బి.ఏ. చదువుకున్నాడు. ఆ చదువుకున్న బి.ఏ.ని రామకృష్ణ పరమహంస సంసర్గంలోకి వచ్చాక ఎప్పుడో మర్చిపోయివుంటాడు. ముక్కు మూసుకోవటాలు, ప్రాణాయామాలు చేయటాలు, ఉపనిషత్తులు చదవటాలే మిగిలి వుంటాయి, మన దృష్టిలో పనికిరానటువంటివి.

ఈ జంషెడ్‌జీ టాటా అప్పుడు ఇంకా అంత గొప్ప సంస్థ పెట్టలేదు. మామూలుగా న్యూస్ పేపర్లు అమ్ముకుంటూ జీవిస్తూ వుండేవాడాయన. ఆయనకి ఈయన పరిచయం అయ్యాడు. దొందుకు దొందు, జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలుతుంది అంటారుకదా. అదన్నమాట పరిస్థితి. వివేకానంద గొప్పవాడు అవ లేదు అప్పటికి. జంషెడ్‌జీ టాటా న్యూస్ పేపర్లు అమ్ముకుంటు న్నాడు. కానీ ఎందుకో ఆయనకి వివేకానందని అడగాలన్పించింది.

"నేను ఏం చేసేది, నాకు డబ్బు అదీ ఏం లేదు, న్యూస్ పేపర్లు అమ్ముకుంటే ఎంతొస్తుంది? ఎలాగ?" అన్నాడు.

"కాదు నాయనా, నేను చెప్పింది నువ్వు చేస్తే, నువ్వు కోటీశ్వరుడివి అవుతావు" అన్నాడు.

**కనీసం భారతదేశంలో ఉన్న గొప్పతనం ఏమిటంటే,**

కాషాయబట్టలు వేసుకున్నవాడు ఏం చెప్పినా మనం ఒప్పుకుంటాం. ఇంకా అది మన గొప్పతనం. వాడు గొప్పవాడు అవునా కాదా అదీ ఏం ఆలోచించం.

"సరే స్వామి, అయితే నన్నేం చేయమంటారు?" అన్నాడు.

"రా!" అన్నాడు, ఒకచోటకి తీసుకెళ్ళాడు. "ఇదీ స్థలం, ఇక్కడ నువ్వు ఒక ఫ్యాక్టరీ కట్టు. చూడు ఏమవుతుందో!" అన్నాడు.

సరే ఆయన ఎలా కట్టాడో, ఏం చేశాడో మరి నాకు తెలియదు. ఏ పుస్తకంలోనూ కూడా నాకు దొరకలేదు. ఈ లోపల వివేకానంద చాలా గొప్పవాడు అయిపోయాడు, ఫారిన్ వెళ్ళాడు,



అక్కడ్నుంచి తిరిగొచ్చాడు. అప్పటికి టాటా కంపెనీ పెట్టేశాడు, ప్లాంట్ కట్టేశాడు, కోటీశ్వరుడు అయిపోయాడు.

"స్వామీ! నన్ను గుర్తుపట్టారా?" అన్నాడు.

"గుర్తుపట్టటం అనేది మాకు జరగదు బాబూ! మేము మర్చిపోం అసలు".

- వివేకానంద యొక్క విచిత్రమైనటువంటి సామర్థ్యం అది. ఏదీ మర్చిపోయేవాడు కాదట.

ఆయన అమెరికాలో అలా తిరుగుతూవున్నప్పుడు ఒక పన్నెండేళ్ళ కుర్రవాడు వచ్చి స్వామీ మీరు గురువులు గురించి, మంత్రాలు గురించి చెప్తున్నారు కదా, నాకు కాస్త ఆ మంత్రదీక్ష, గురుదీక్ష ఇస్తారా అన్నాడు.

"నేను కాదు, నీ గురువు రాబోతున్నాడు. ఒక క్రిస్టమస్‌నాడు నీకు గురువు వెండి గిన్నె ఇస్తాడు. ఆ వెండి ఉగ్గుగిన్నె ఇచ్చినప్పుడు నేను చెప్పిన మాటలు నీకు గుర్తొస్తాయి. అతను నీకు గురువు అవుతాడు" అని చెప్పాడు.

ఇది చెప్పింది ఎప్పుడు? 1896 - 98 ఆ కాలంలో చెప్పాడు. నాకు కరెక్ట్‌గా సంవత్సరం గుర్తులేదు. తరవాత 30 ఏళ్ళకి పరమహంస యోగానంద అమెరికాకి వెళ్ళినప్పుడు అప్పటికి ఈ 12 ఏళ్ళ కుర్రవాడు 42 ఏళ్ళవాడు ఎంతో అయ్యాడు. ఒక క్రిస్టమస్‌నాడు పరమహంస యోగానంద చెప్పినటువంటి క్లాస్‌కి వచ్చినప్పుడు ఎందుకో ఒకావిడ యోగానందకి ఒక వెండి ఉగ్గుగిన్నె ఇచ్చింది. ఆ టైమప్పుడు అతను

అక్కడికి వచ్చాడు. ఈ ఉగ్గు గిన్నె తీసి అతనికి ఇచ్చాడు. నాకు చెప్పాడు ఒక ఇండియన్ స్వామి అని అప్పుడతనికి గుర్తొచ్చింది.

**అంటే ఆ ఇండియన్ స్వామి ఏం చేయగలిగాడంటే,**

❄ న్యూస్ పేపర్లు అమ్ముకుంటోన్నటువంటి ఒక వ్యక్తికి ఎక్కడ అతను తన కార్యకలాపాలు చేసుకుంటే కోటీశ్వరుడు అవుతాడో చెప్పగలిగాడు.

**ఈనాడు పెద్ద తమాషా నేను ఏం చూశానంటే,**

ఎకానమిక్స్ లెక్చరర్స్ షేర్ మార్కెట్‌లో అన్నీ పోగొట్టుకుని ఆత్మహత్యలు చేసుకున్నవాళ్ళు నాకు చాలా మంది తెలుసు. వీళ్ళెవరు వాళ్ళు? ఎకానమిక్స్ లెక్చెరర్స్.

**వాళ్ళ విద్య ఏం చెప్తుందంటే,**

డబ్బుని ఎలా పెట్టుబడిగా పెట్టుకోవాలో. ఎకానమిక్స్ అంటే తెలుసు కదా మీకు. కాని ఈ విద్య నేర్చుకున్నటువంటి వాళ్ళు ఎవ్వరూకూడా షేర్ మార్కెట్‌లో కోటీశ్వరులు అవలేదు. నాకు తెలిసి అవలేదు. ఇదిగో వీడు ఎకానమిక్స్ చదివినవాడు అయ్యాడు అని మీకు తెలుసుంటే చెప్పండి. ఎవరు అవుతారు? బ్రోకర్స్ అవుతారు.

**రెండవది ఆ ఇండియన్ స్వామి ఏం చెప్పగలిగాడు,**

❄ ఎకానమిక్స్ చదవని వాణ్ణి కోటీశ్వరుడ్ని చేసినట్టే, 12 ఏళ్ళ కుర్రవాడు ఆయన దగ్గరకు వచ్చినప్పుడు 30 ఏళ్ళ తరవాత కచ్చితంగా క్రిస్టమస్ నాడు నీకు ఉగ్గు గిన్ని ఇచ్చినటువంటి వ్యక్తి నీకు గురువు అవుతాడని 30 ఏళ్ళ క్రిందట చెప్పగలిగాడు.



మరి ఆ విద్య నేర్చుకోవాలని అనిపించటంలేదా మీకు?

నేనేం చేయగలను నేర్చుకోవాలని అనిపించకపోతే!

నేనూ ఏం చేయలేను.

**అంటే ఒకటవ్వచ్చు**

పేరు తెచ్చుకోవాలని లేదేమో మనకి.

 మనం అనామకులుగా, ఎందుకూ పనికిరానటువంటి వ్యక్తులుగా జీవించాలనే ధృడ సంకల్పంతో భారతీయులు అందరం పుట్టివుంటాం అనిపిస్తుంది నాకు.

**ఎంచేతంటే,**

ఇంత స్పష్టంగా మన జీవితాలు మారిపోతాయి అంటే ఇంకా ఏం అడుగుతారంటే,

"మావాడు బాగా చదువుకునేటట్టు చేయండి మాస్టారు!"

 పోనీ అడిగేదేదో "మావాడ్ని కోటీశ్వరుడ్ని చేయండి మాస్టారు" అని అడగరు, అదేంటో తమాషా! వాడు చదువుకుంటే కోటీశ్వరుడు అయిపోతాడనా మీ ఉద్దేశ్యం! అవుతాడా?

 "బాగా చదువు వచ్చేటట్టు దీవించండి మాస్టారు!"అంటే బాగా అడుక్కునేటట్టు దీవించండని మీరు అడుగుతున్నారు నన్ను.

 అర్థం చేసుకోండి. ఎన్నిసార్లు ఇన్ని రకాలుగా చెప్పినా కూడా ఆధ్యాత్మిక విద్యలో, మన సంస్కృతిలో, మన విజ్ఞానంలో ఉన్నటువంటి గొప్పతనాన్ని మనం వదిలేసుకుంటున్నాం.



నర్మదానది ఒడ్డున ధునీవాలా బాబా అని ఇంకొక వ్యక్తి ఉన్నాడు. ఆయనకి ఒక విచిత్రమైనటువంటి తమాషా అలవాటుంది.

ఆయనకి సరదాగా చచ్చిపోవటం అలవాటు.

పల్లెటూళ్ళలో తిరుగుతూ ఉండేవాడు. తిరుగుతూ చచ్చి పోయేవాడు. వాళ్ళు చాలా బాధపడిపోయి మా ధునీవాలా బాబా చనిపోయాడు అని ఏం చేసేవారంటే సమాధి కట్టేవారు. సమాధి కట్టిన 3వ రోజు ఆయన ఇంకో ఊళ్ళో ప్రత్యక్షమయ్యేవాడు. మన వాళ్ళు వ్రాస్తే నమ్మంకదా, కట్టు కథ అంటాం. ఇంగ్లీష్ కలెక్టర్ తన గెజిట్‌లో వ్రాశాడు.

⇨ "హమ్మయ్య! ఇంగ్లీష్ కలెక్టర్ గెజిట్‌లో వ్రాశాడు కనుక అది కరెక్టే". కరెక్టే. కాదని కాదు. కాని మన మానసిక స్థితి ఎలా ఉందో చూడండి.

ఫాక్స్‌గారు చెప్తే నమ్ముతాం, గురుదేవులు చెప్తే నమ్మం.

➡ ఫాక్స్ అంటే ఎవడు? నక్క. ఉల్ఫ్, తోడేలు. విదేశీ పేర్లు ఇలాగే కదా ఉంటాయి, ఉల్ఫ్‌లు, ఫాక్స్‌లు.

అంచేత ఈ ఆధ్యాత్మిక విద్యలో సరదాగా చనిపోయి మళ్ళీ మళ్ళీ ప్రత్యక్షమయ్యే వ్యక్తులు ఉన్నారు.

**ఇంకా ఆయన ఏం చేసేవాడు,**

ఎవడైనా వచ్చి "బాబా మా అమ్మాయి పెళ్ళి చెయ్యాలి అనుకుంటున్నాను." "ఔనా!" అని చెప్పి నర్మదా నది ఒడ్డున ఉన్నటువంటి రెండు ఇసుక రేణువులు తీసి ఇచ్చేవాడు. బంగారంగా



మారిపోయేవి. అవి అమ్ముకుని పెళ్ళి చేసేవాడు. "ఇప్పుడుంటే ఎంత బావుండునో!"

ఒక మహారాణి ఈయన గురించి విని బంగారు తీగలతో అల్లిన ఒక శాలువా తీసుకొచ్చి ఆయనకు కప్పింది. "ఏంటిది?" అన్నాడు. "బంగారు శాలువా" అంది. మరి ఆయన ఏం మూడ్‌లో ఉన్నాడో, ఏమిటో, ధునీవాలా బాబా అంటే అర్థమేమిటి, ధుని ఉండేది కదా, తీసి అందులో పడేశాడు. పాపం ఆవిడ చాలా బాధపడిపోయి "వెళ్ళి వెళ్ళి ఈ వెర్రాడికిచ్చాను నేను, అసలు బంగారం అంటే వీడికి తెలీదు".

చూడండి మన బుద్ధి ఎంత భ్రష్టు చెందుతుందో. ఆయన చేత్తో ఇసుక తీసి ఇస్తే అది బంగారం అవుతుందని మనకి తెలుసు, ఆ కాలంలో అందరికీ తెలుసు. అందుకే కదా ఆవిడ బంగారపు జరీ శాలువా కప్పింది. కాని ఆయనకి బంగారం ఏమిటో తెలీదు అంది. అర్థమైంది ఆయనకి. ఈ లోపల ఇది కాలి బూడిద అయి పోయింది. నిప్పులో చెయ్యి పెట్టాడు, తీసాడు. "ఇదేగా నీ శాలువా, తీసుకుపో" అన్నాడు.

## మరి ఆ విద్య మీకు అక్కర్లేదా?
## నేర్చుకోవాలని అనిపించటం లేదా?

అదే నర్మదానది ఒడ్డున కేశవస్వామి అనుకుంట, ఒక యోగి ఉండేవాడు. ధునీవాలా బాబాకు సమకాలికుడు. సడన్‌గా ఆయన ఆశ్రమానికి ఓ రెండువందల మంది భక్తులు బస్సులు వేసుకుని

రాత్రి పదకొండున్నర ఆ ప్రాంతానికి వచ్చారు. ఆయన ఒక గొప్ప వ్యక్తి. సాధారణంగా ఆశ్రమంలో అన్నీ ఉండేవి. కాని ఆ రోజు ఎందుకో అన్నీ నిండుకున్నాయి. రెండువందల మందికి పెట్టగలిగేవి లేవు. ఏదో కొంచెం ఉంది. ఇప్పుడు ఏం చేయాలి? రెండు వందల మందికి భోజనం పెట్టాలి. తన శిష్యులు ఒకడ్ని పిలిచి ధునీవాలా బాబా ఎక్కడ ఉన్నాడో వెతుకు. ఆయనకు చెప్పు నేను పంపించానని, ఈ ప్రోబ్లమ్ వచ్చి పడింది ఏం చేయాలో అడుగు అన్నాడు.

సరే వెతికితే ఆయన నర్మదానది ఒడ్డున ఒక గోచీ పెట్టుకుని హాయిగా పడుకుని ఉన్నాడు. "బాబా! ఈ ప్రోబ్లమ్ వచ్చింది, రెండు వందల మంది వచ్చేశారు భోజనానికి, ఏమీ లేదు" అన్నాడు. "పాత్ర తీసుకురా" అన్నాడు. అక్కడకి ప్రక్కనే ఆశ్రమం, పాత్ర తీసుకొస్తే ఇంత ఇసుక తీసి అందులో పోశాడు. "ఉడికించి పెట్టేయ్" అన్నాడు.

ఇసుక. ఉడికించి పెట్టేయ్ అన్నాడు. పిచ్చెక్కింది ఆ శిష్యుడికి. ఇసుకని ఎలా ఉడికిస్తాం! పోనీ ఇసుకని ఉడికించామే అనుకో, అది ఉడకదు. అది ఎలా పెడతావు నువ్వు? కానీ ఆయన గురువు పంపించాడుకదా, అంచేత వెళ్ళి "నువ్వేదో పంపించావు అక్కడికి, ఇంత ఇసుక ఇచ్చాడు" అన్నాడు.

"ఆ, ఇసుక ఇచ్చాడా!" అని ఆయన చాలా ఆనందించి, ఆ ఇసుకని 5 భాగాలు చేశాడట. ఇది కూర అన్నాట్ట, ఇది పప్పు అన్నాట్ట, ఇది పూరీ అన్నాట్ట. అని ఇది ఇంక ఉడికించండి 5 గిన్నెల్లో అన్నాట్ట. మూత పెట్టేశాడు. ఉడికించుకోండి అన్నాడు. ఉడికించు కోండి అన్న తరవాత వచ్చిన 200 మందికి ఆహార పదార్థాలు సప్లయి.



## ఇలాంటి విద్య ఉన్నటువంటి భారతదేశంలో ఉద్యోగం అవసరమా?

తక్షశిల, నలందాలో అలాంటి పరిస్థితులు ఉండేవి.

***తమాషా ఏమిటంటే,***

ఆ విద్య మర్చిపోయాం మనం.

అంతకంటే ఇంకేం లేదు.

✤ ఆ విద్య ఈనాటికీ ఉంది. ఇప్పుడు నేను చెప్పినవాళ్ళు పూర్వ కాలపు ఋషులుకారు, ఈ కాలపువాళ్ళే వాళ్ళు. బ్రిటిషర్స్ వాళ్ళ గెజిట్‌లో వ్రాసుకున్నటువంటి వాళ్ళు.

***కానీ నాకు ఆశ్చర్యం ఏమిటంటే,***

వాళ్ళకు కూడా ఈ విషయం నేర్చుకోవాలని అన్పించలేదు.

* వాళ్ళకి అన్పించకపోవటం ఓ.కె. ఎంచేతంటే, వాళ్ళకి ఆ సంస్కారం లేదు. మనకి అన్పించకపోవటం ఉన్నదే,

అదీ మన దౌర్భాగ్యం.

అదే కలియుగం అంటే.

***అంచేత ఆధ్యాత్మిక విద్య అంటే ఇప్పుడు అర్థమవుతోందికదా,***

ఏ ఒక్కటి తెలిస్తే మీరు అన్నీ చేయగలరో ఆ విద్య ఇది. మీరు మనుష్యులను కోటీశ్వరులు చేసేయగలరు! తిండి లేనివాళ్ళకి తిండి పెట్టేయగలరు, ఒకళ్ళకి ఇద్దరికీ కాదు, అనేకమందికి. రోగగ్రస్తులయినటువంటి వాళ్ళకి రోగాలు నయం చేసేయగలరు.

ఏ ఒక్క విద్య తెలిస్తే మీరు అన్నీ చేయగలరో, ఆ విద్యకి ఆధారభూతమైనటువంటి రెండు విషయాలు నేను మీకు ప్రొద్దున్న చెప్పాను. గాయత్రీ మంత్రము, యజ్ఞవిద్య.

అంత గొప్ప స్థితికి మిమ్మల్ని గ్యారంటీగా తీసుకెళతాయవి. కానీ ఒక రోజులో తీసుకెళ్ళవు. ఒక ఇంజనీరింగ్ చదవాలంటే 22 ఏళ్ళు మీరు కష్టపడాలి. లక్షలాది రూపాయలు ఖర్చుపెట్టుకోవాలి. మరి ఈ విద్య నేర్చుకోవటానికి ఒక జన్మలో రాదు మీకు. అనేక జన్మలు పడుతుంది.

- కానీ నాకు తెలిసున్నటువంటి నిజము, ప్రోబబ్లీ మీరు నమ్మలేనటువంటి నిజము, నమ్మరేమో కూడా!

  " శ్రీరామశర్మ ఆచార్య " అనేటటువంటి వ్యక్తి పేరు విన్నటువంటి వ్యక్తి, పేరు విన్న రోజు నుంచి కచ్చితంగా ఐదేళ్లలో ఆ స్థితికి వెళ్లగలరు.

వెళ్ళగలరు!

వెళతారా, లేదా? నాకు తెలియదు.

పేరు విన్న దగ్గర్నుంచి. అంత శక్తిగల గురువు యొక్క సంరక్షణలో, అంత శక్తిగల గురువు యొక్క శిష్యులుగా ఉంటూ, అసలీ ఆధ్యాత్మిక విద్యను మర్చిపోయాం మనం. ఈ గాయత్రీ మంత్రం యొక్క శక్తిని మర్చిపోయాం మనం. యజ్ఞవిద్య యొక్క శక్తిని మర్చిపోయాం. అది మర్చిపోయి యజ్ఞాలు చేసేసుకుంటూ వుంటాం, గాయత్రీ మంత్రాన్ని చేసేసుకుంటూ ఉంటాం.

మొన్న ఒక వ్యక్తి, "మాస్టారు, మేము యజ్ఞం అదీ చేస్తున్నాం, ఒక ఎమ్మెల్యేని కలుసుకోవటానికి వెళుతున్నాం సార్! కాస్త పని అయ్యేటట్టు చూడండి" అన్నాడు.

వాడు ఎమ్మెల్యే అవటానికి ఈ గురువు సహాయం కావాలి. ఎమ్మెల్యేయే కాదు, ఎమ్.పీ.లు అవ్వాలన్నా, ప్రైమ్ మినిస్టర్ అవ్వాలన్నా, మీకు తెలుసా ఇందిరాగాంధీ ఎంత మంది గురువుల అనుగ్రహంతో అంత గొప్ప వ్యక్తి అయిందో! కానీ వీడు గాయత్రీ చేస్తూ, యజ్ఞాలు చేస్తూ, ఎవడి రికమెండేషన్ కావాలి? ఒక ఎమ్మెల్యే రికమెండేషన్ కావాలి.

వాడు నీ దగ్గరకి రావాలి! బాబూ నేను ఇది కట్టించి ఇస్తాను అంటే, "నాకు ఓపిక లేదురా బాబూ, ఎన్ని సంస్థలు పెట్టుకుంటాను నేను" అని నువ్వు ఫోజు కొట్టాలి.

ఆ స్థాయిలోకి మీరు ఎదగగలరు!

ఐదేళ్ళు చాలు.

✦ ఆషామాషీగా నేను చెప్పటం లేదు. మిమ్మల్ని ఉత్సాహపర్చటానికి చెప్పటం లేదు. నాకు తెలిసున్నటువంటి నిజము చాలా స్పష్టంగా చెప్పదల్చుకున్నాను. అందుకే ఇది నా చివరి మీటింగ్ అన్నాన్నేను.

**ఎంచేతంటే,**

ఇది చెప్పేసిన తరవాత, కొన్ని సత్యాలు చెప్పిన తరవాత నేను మీ మధ్య ఉండటానికి అర్హత కోల్పోతాను.



✌ ఆ సత్యాలు తెలుసున్నటువంటి వ్యక్తులు దాన్ని ఆచరిస్తారా, ఆచరించరా అనేటటువంటిది విన్నవాళ్ళ యొక్క మానసికస్థితి బట్టి ఉంటుంది తప్ప, గురువు బట్టి ఉండదు.

☝ అంచేత మీరు మీ యొక్క గొప్పతనాన్ని అర్థం చేసుకోండి. ఇక్కడ కూర్చున్నవాళ్ళే కాదు, ఎవరెవరు పండిత శ్రీరామశర్మ ఆచార్య అనేటటువంటి నామము విని ఉంటారో, కచ్చితంగా వాళ్ళు ఆ నామము విన్న రోజు నుంచి ఐదేళ్ళ లోపల యోగులయిపోతారు. పిచ్చివాళ్ళగా మారి కాదు, రహస్యంగా.

కానీ ఏం చేయాలో తెలియాలి. అంచేత మీరు ఏం చెయ్యాలో చాలా స్పష్టంగా చెప్తున్నాను నేను. అది చెప్పేసిన తరవాత ఇంక నా ఉనికి అనవసరం మీకు. యథేచ్ఛసి తథా కురు. ఇంక చెప్పేసిన తరవాత ఇంక ఎన్ని సార్లు చెప్తాన్నేను? ఒక ప్రణాళిక మీకు ప్రొద్దున్న చెప్పాన్నేను.

## ఏం చెప్పాన్నేను మీకు?

గాయత్రీ మంత్రాన్ని పరసువేదిగా, కామధేనువుగా, కల్ప వృక్షంగా గుర్తించండి. కబుర్లు కావవి. కచ్చితంగా అంతే అది.

అది ఎలా అవుతుంది, ఎందుకది పరసువేది, కామధేనువు, కల్పవృక్షము అయింది అన్నదానికి మన వేదాలలో, మన ఉపనిషత్తు లలో, మన గురుపరంపరలో చాలా అస్పష్టంగా చెప్పబడివుంది. దానిని సుస్పష్టంగా డిజిటల్‌గా, టీవీలో ఏమిటో ఇప్పుడు చూపిస్తూ వుంటారుకదా, ఒక బొమ్మేమో మామూలు బొమ్మ చూపిస్తాడు.



ఇంకొకటేమో డిజిటల్ బొమ్మ చూపిస్తాడు. చూశారా ఎంత క్లియర్‌గా కనిపిస్తోందో అంటాడు. అలాగ మిగతావన్నీ కూడా ఏమిటి? నాన్‌డిజిటల్ అన్నమాట. శ్రీరామశర్మ వ్రాసినటువంటి "గాయత్రీ మహావిజ్ఞాన్" డిజిటల్ అన్నమాట. చాలా స్పష్టంగా ఆయన వ్రాశాడు.

నా దగ్గర ఉన్నవాళ్ళకి, నాకు దూరంగా ఉన్నవాళ్ళకీ కూడా ఈనాటి వరకు ఈ మాటలు నేను ఎప్పుడూ స్పష్టంగా ఎవరికీ చెప్పలేదు. కానీ ఈ పూర్ణిమనాడు ఇది చెప్పమని నాకు క్రిందటి పూర్ణిమలో నాకు ఒక అవగాహన వచ్చింది. అది చెప్పటానికి తగిన అర్హత ఉందా లేదా అన్నదానికి నాకు ఒక సంవత్సరం పట్టింది.

**ఎంచేతంటే,**

నేను అంత తొందరగా ఎవరినీ నమ్మను. శ్రీరామశర్మ ఆచార్యను కూడా నమ్మనంత తొందరగా. కానీ నమ్మానంటున్నాను కదా! ఒక సంవత్సరం పట్టింది ఇది మీకు చెప్పటానికి. చెప్పొచ్చో, చెప్పకూడదో! ఇది కరెక్ట్ అవునో, కాదో!

**ఎంచేత?**

ఆయనే చెప్పారు, నువ్వు ఇలా సందేహిస్తూ ప్రవర్తించమని. ఆయన గురుదేవులు ఆయనకి కనిపిస్తే, ఆయన కూడా ముందు ఇది భూతమేమో, ఇది పిశాచమేమో, ఇది నా భ్రాంతియేమో అను కున్నారు. అలాగే ఇవి మీకు చెప్తోన్నంత మాత్రాన మీరు నమ్మకండి.

కానీ నమ్మటానికి నేను ఆధారాలు చూపిస్తున్నాను. మీకు సర్వజ్ఞత్వం వస్తుంది, సర్వవ్యాపకత్వం వస్తుంది, సర్వసమర్థతా



వస్తుంది అని ఈ కాలపు యోగుల యొక్క ఉదాహరణలు చెప్తూనే మీకు ఈ విద్య గురించి చెప్తున్నాను. పూర్వకాలం ఋషుల గురించి నేను మాట్లాడటం లేదు. ఇప్పుడు చెప్పినటువంటి వాళ్ళు అందరూ కూడా ఈ కాలపువాళ్ళే.

- ఈ గాయత్రీ మంత్రము యొక్క ఒక తూఫాను, కుదపండి ఆంధ్రప్రదేశ్‌ని మీరు. ఆంధ్రప్రదేశ్ యొక్క చరిత్ర అది. ఆంధ్రప్రదేశ్‌కి పట్టబోయేటటువంటి యోగ్యత అది.

భారతదేశమే జగద్గురుపీఠం వహిస్తే,
ఆ జగద్గురుపీఠంలో చక్రవర్తిత్వం ఆంధ్రప్రదేశ్‌ది.

- మన అదృష్టం ఆంధ్రులుగా పుట్టటం. కానీ మన దురదృష్టం కూడా ఆంధ్రులుగా పుట్టటమే.

***ఎందుకంటే,***

ప్రకృతి మీకు ఈ అవకాశం ఇచ్చినా మనలో స్పందన కలగటం లేదు. స్పందించండి, మీరు ఊగండి. నేర్చుకోండి.

***నాకు చాలా ఆనందం ఎక్కడేసిందంటే,***

ఇవాళ చాలా మంది గాయత్రీ మహావిజ్ఞాన్ పుస్తకాలు కొన్నారు. అదే పెద్ద నిదర్శనం మీకు ఆ భవితవ్యత ఉందని. చెప్పగానే చేసేశారుకదా! కానీ పుస్తకాలు కొని ..... ఏం కథ చెప్పాన్నేను? పరసువేది కథ. ఎక్కడ పెట్టాడు పరసువేదిని? అది చేయకండి. పడేసుకోకండి, చదవండి. అవగాహన చేసుకోండి. డిజిటల్ బుక్ అని చెప్తున్నాను నేనది.



గాయత్రీ మహావిజ్ఞాన్ అనేటటువంటి ఆ మూడు పుస్తకాలు మిమ్మల్ని మూడు సముద్రాలులోకి తీసికెళ్ళిపోతాయవి. చిన్న చిన్న పుస్తకాలని మీకు అనిపిస్తోంది. మీరు చదివి లోతులకెళ్ళండి, అసలు చూడండి మీరు ఎక్కడికెళ్ళిపోతారో! కొట్టుకుపోండి, ధైర్యం చేయండి. సాహసం చేయండి.

**కానీ గురుదేవులు యొక్క విధానం ఏమిటంటే,**

మీరు ఏమీ వదులుకోవక్కర్లేదు. మీరు ఎక్కడున్నారో అక్కడే ఉండండి. మీ దేశకాల పరిస్థితుల్లో మీకు ఏ విధమైనటు వంటి బాధ్యతలు ఉన్నాయో, ఆ బాధ్యతల్ని చేసుకుంటూ ఉండండి. చేసుకుంటూ టి.వీ. చూసే టైమ్‌లో, న్యూస్ పేపర్ చదివే టైమ్‌లో ప్రక్కింటి వాళ్ళు మనకంటే ఎంత దద్దమ్మలో అని చర్చించుకునే టైమ్‌లో వీటిని చదువుకోండి.

- "నేనే కనుక ప్రక్కింటివాడుగా ఉండివుంటే ఎంత గొప్ప పనులు చేసివుండేవాడినో" అనుకుంటూవుంటాం మనం. కానీ మన ఇంటిని మనం బాగు చేసుకోలేం. ఈ వేస్ట్ చేసే టైమ్‌ని గాయత్రీ మహావిజ్ఞాన్ చదువుకోవటానికి ఉపయోగించండి. దీనిని "సమయదానము" అంటాం మనం.
- గురుదేవులు అందించినటువంటి ఫార్ములాలలో, సుస్పష్టమైనటువంటి జీవితంలో మీరు నేర్చుకోవలసింది ఏమిటంటే, ఈ సమయదానము, టైమ్‌ని ఇవ్వండి. ఆ పుస్తకాలను చదవండి.

## ఎప్పటిలోగా చదవాలి మాస్టారు?

2004 కృష్ణా పుష్కరాలకి పూర్తి చేయండి. అంటే, చాలా టైముంది అనుకోకండి. మీకు నేర్పేవాళ్ళకి చాలా టైముంది. మీకు టైమ్ లేదు, మీరు గబ గబా ఆ పుస్తకాన్ని నేర్చేసుకోవాలి. అంచేత ఈ గోదావరీ పుష్కరాలు లోపల అయిపోవాలని నా కోరిక.

మీరు ఇది చేస్తూవుంటే చాలా మంది మళ్ళా మిమ్మల్ని కన్ఫ్యూజ్ చేసేస్తారు. గాయత్రీ మంత్రాన్ని ఆడవాళ్ళు చేయకూడదు, మగవాళ్ళు అసలే చేయకూడదు. మరి ఎవరు చేయాలి అంటే, జంతువులు చేయాలని అన్నారనుకోండి మళ్ళా మీరు కన్ఫ్యూజ్ అయిపోతారు. అంచేత మీ గురువు మీద ఆ నమ్మకం ఉంచుకోండి.

## నేను చెప్తున్నానుకదా,

ఆయన్ని నేను మామూలుగా టెస్ట్ చేయలేదు, అనేక రకాలుగా చేశాను. ఆయన్ని టెస్ట్ చేయటానికి నాకు కావలసినటువంటి ఆధ్యాత్మిక అర్హతలు నేను మీతో పంచుకోదల్చుకోలేదు. కామన్‌సెన్స్ అర్హతలే నేను చెప్తున్నానుకాని, ఆధ్యాత్మికంగా ఆయన్ని నేను ఎలా పరీక్షించగలిగాను అనేది నేను చెప్పినా మీకు అర్థంకాదు.

అంచేత ఆ వ్యక్తి చెప్పిన మాటలు నమ్మాలితప్ప మీరు, ఎవరో ప్రక్కింటి వాళ్ళు చెప్పారని మానేస్తారు. భలే మనుష్యులు దొరికారు. గురువు చెప్పినటువంటి మాటల్ని నమ్మండి. ఆ గాయత్రీ మహావిజ్ఞాన్‌లో చెప్పినటువంటి విషయాలను ఆగస్టు లోపల ఎన్ని సార్లు మీరు ఆ పుస్తకాన్ని మథించగలరో అన్ని సార్లు మథించండి.



ఆ పుస్తకాలలోని విషయం మీ వల్ల అర్థంకాదది. ఆ గురువు యొక్క అనుగ్రహం వల్ల అర్థమవుతుంది. ఆ అనుగ్రహం పుష్కలంగా ఉంది. చాలా కరెక్టయినటువంటి టైమ్‌లో మీరు ఈ మార్గంలో పడ్డారు. టైమ్ వేస్ట్ చేసుకోకండి.

ఈ క్లాస్ అయిపోయిన తరవాత, పూర్ణిమా ధ్యానం అయి పోయిన తరవాత ఇవాళే ఒక పేజీ చదివేయండి. మీకు దమ్ముంటే ఒక పుస్తకం చదివేయండి. ''ఇంకా సేపు మాట్లాడితే మూడూ అంటారేమో ఈయన బాబోయ్!'' కొంచెం ఆ తక్షణం చేసే అలవాటు అలవర్చుకోండి. అంతే తప్ప రేపు అనకండి.

❁ మీరు ఆధ్యాత్మిక జగత్తులోని ఆ నియమాన్ని అర్థం చేసుకోండి. రేపు అనేది ఆధ్యాత్మిక జగత్తులో లేదు. ఎప్పుడూ now. నిత్య నూతన శాశ్వత ధర్మము అంటాం మనం. ఆధ్యాత్మిక జగత్తులో నిన్నా లేదు, రేపూ లేదు. ఉన్నది ఇవాళే, ఈ క్షణమే.

అంచేత ఆ ఆత్రుతను అర్థం చేసుకుంటూ, ఇంకొక మూడు నియమాలు మీరు పాటించటానికి పునాది వేసుకోండి. ఒకటేమో పుస్తకాలు చదవమని చెప్తున్నాను. ఆ మూడు బుక్సు మీరు ఎన్ని సార్లు చదవగలిగితే అన్ని సార్లు చదవండి.

☝ పారాయణలాగ చదవకండి. అధ్యయనంలాగ చదవండి.

తేడా అర్థమయిందికదా. పారాయణ అంటే చదివేస్తాం. అది శిరిడీసాయి చరిత్రకి చేయొచ్చు, గురుచరిత్రకి చేయొచ్చు. మాతా భగవతీదేవి శర్మ చరిత్రను మీరు పారాయణలాగ చదవొచ్చు.

దీనిని పారాయణలాగ చదవకండి. ఒక ఇంజనీరింగ్ చదవదల్చు కున్నటువంటి స్టూడెంట్ ఎంట్రన్స్ టెస్ట్‌కి ఎలా ప్రిపేర్ అవుతాడో, అలాగ ప్రిపేర్‌కండి. ఒకొక్క లైన్ మీరు చదివితే, ఈ లైన్‌లో ఎవరు ఏ ప్రశ్న వేయొచ్చో ఆలోచించుకోండి.

వీలయితే మనమే తరవాత గాయత్రీ మహావిజ్ఞాన్ మీద ఒక ఎంట్రన్స్ టెస్ట్‌లాగ టెస్ట్ పెట్టేసుకుందాం. క్వశ్చన్‌లు కూడా మీరే తయారుచేసుకోవాలి. మళ్ళా మాస్టారు మీరు క్వశ్చన్‌లు వేయండి అనకండి. అర్థమయిందా నేను చెప్తోన్నదేమిటో. కొంచెం అలా చదవటం నేర్చుకోండి.

దానికి మీకు ఈనాడు ఉన్నటువంటి విద్య చదవవలసి నటువంటి అవసరం లేదు. "మేం సైన్స్ చదవలేదు మాస్టారు, మేం పెద్దగా చదువుకోలేదు మాస్టారు!" మీకు తెలుగు అర్థమయితే చాలు. అదొక్కటే కండిషన్. మీకు తెలుగుభాష అర్థమవుతోందికదా!

## ఎందుకన్నానంటే,

ఒక గంట ముందు ఒక దంపతులు నా దగ్గరకి వచ్చి వాళ్ళ అమ్మాయిని ఎల్.కె.జీ.లోనో, ఎందులోనో జేర్పిస్తామన్నారు. మీ అమ్మాయికి తెలుగు అర్థమవుతుందా అన్నాను. నేను నవ్వుతూ మామూలుగా అడిగాను. అర్థంకాదట తెలుగు ఆ అమ్మాయికి. మన విద్య అలావుంది. ఇవాళే జరిగింది ఆ సంఘటన. అది రైటా, తప్పా అనేం నేను అనటంలేదు. ఆ పరిస్థితి అలాగ ఉంది.

ఇంగ్లీషు చదివితే చాలా గొప్పవాళ్ళం అన్నమాట.



వద్దు. తెలుగు చదవండి, తెలుగులో ఉన్నాయి ఆ పుస్తకాలు. తెలుగు మీకు అర్థమవుతుంది కనుక, చదివితే మీకే దాంట్లో ఉన్నటువంటి అంతరార్థాలు బోధపడతాయి. దాన్ని ఎలా ఉపయోగించుకోవాలో బోధపడుతుంది.

❋ నా జీవితమే నా వారసత్వము, నా వీలునామా అన్నటువంటి గురువు ఈయన ఒక్కడే.

**వీలునామా అంటే ఏమిటో తెలుసా?**

ఉన్న ఆస్తిని పంచటం.

**మిగతా గురువులు అందరూ ఏం చెప్పారంటే,**

మై లైఫ్ ఈజ్ మై మెసేజ్. నేను ఇచ్చే సందేశం ఇదిరా, మీరు అర్థం చేసుకోండి అన్నారు.

ఈయన ఆ మాట అనలేదు, నా వీలునామా అన్నారు. మీకు అర్థమవుతోందా ఆ మాటలో ఉన్నటువంటి గొప్పతనం? మీరది అర్థంచేసుకుంటే ఆయనెంత గొప్పవాడో అర్థమవుతుంది. అందుకు ఇంత బల్లగుద్ది నేను చెప్పగలుగుతున్నాను,

ఐదేళ్లలో మీకు కచ్చితంగా ఆ స్థాయి వస్తుందని.

**ఎంచేతంటే, వీలునామాలో మీరు చేయవలసింది ఏమిటి?**

వీలునామాలో ఇదిగో ఈ ఈ లక్షణాలు ఉన్నటువంటి వాళ్ళకి నా ఆస్తి ఇచ్చేస్తున్నాను అన్నారాయన. ఆ లక్షణాలు మీకు ఉంటే చాలు. మీరు విశేషమైనటువంటి కష్టాలు పడక్కర్లేదు.



ఎందుకు ఆయన ఆ పేరు పెట్టారో కూడా చాలా మందికి తెలియదు. చాలా మంది బుర్ర పనిచేయించరు. వచ్చిన పెద్ద గొడవ అది. మన వారసత్వము, నా వీలునామా, అదీ గురువుగారు తన ఆత్మకథకి పెట్టినటువంటి పేరు. వీలునామా వ్రాశారు.

**ఆ వీలునామాని, ఆ శక్తి ఎవరికి ఇస్తానన్నారు?**

ఆ పుస్తకం చదివినవారికి. అంతేగా! మరి మీలో గురువుగారి ఆత్మకథ చదవని వాళ్ళు ఎవరైనా ఉన్నారా? నిజంగా చెయ్యేత్తండి చదవకపోతే. ఇద్దరు, ముగ్గురు. మిగతా వాళ్ళకందరికి వచ్చేసింది వీలునామా. చదవని వాళ్ళు ఆ వీలునామా చదవండి, మీకూ వచ్చేస్తుందది.

అది తీసుకుని రావటానికి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి మీలో పెంపొందించటానికి మీ జీవితంలో ఇంకొక మూడు పనులు మీరు చెయ్యాలి. ఒకటి, గాయత్రీ మంత్రం అదీ చేసుకోమన్నాను, యజ్ఞం చేసుకోమన్నాను.

**ఇంకోటేం చేసుకోవాలంటే మీరు,**

**ఆసనాలు వెయ్యాలి.**

గాయత్రీ మహావిజ్ఞాన్ 3వ భాగం చాలా మంది చేతుల్లో ఉండుంటుంది. చూడండి, గురువుగారు 8 ఆసనాలు అందులో ఇచ్చారు. ఈ ఆసనాలు వెయ్యండి, నా వారసత్వం మీకు వచ్చేస్తుంది, నా వీలునామా ప్రకారం నా శక్తి నీకు వచ్చేస్తుంది అన్నారాయన. చూసుకోండి అందులో ఉన్నాయి బొమ్మలు, అందుకని చెప్తున్నాను.



ఆసనాలు ప్రతీ రోజూ వెయ్యాలి మీరు. మీలో చాలా మంది ఏం అనుకోవచ్చు అంటే, మాకు వయస్సు అయిపోయింది, లేకపోతే మేం చాలా చిన్నవాళ్ళం, చదువుకోవాలి. లేకపోతే మాకు కాళ్ళూ, చేతులూ వంగవు, మేం ఆసనాలు ఎలా వేస్తాం అని.

**నా జీవితంలో నేను చాలా బాధపడేది ఎందుకంటే,**

☺ నేను రెండు పెద్ద తప్పులు చేశాను. సభాముఖంగా ఆ తప్పులు చెప్పుకుంటే, చేసిన పాపం మాత్రం పోదు. ఎంచేతంటే, ఎంత మందికి నేను తప్పు ద్రోవ చూపించానో నాకే తెలియదు.

**ఏమిటంటే,**

ఆసన, ప్రాణాయామాలు వేస్ట్ అనుకునేవాడిని నేను. పోనీ నేను వేస్ట్ అనుకుంటే పర్వాలేదుకదా, నా దగ్గరకి వచ్చేవాళ్ళకి కూడా అదే చెప్పేవాడిని చిన్నప్పట్నుంచి. "ఆ, ఆసనాలు ఎందుకు, ప్రాణాయామాలు ఎందుకు?" ఇవాళ ప్రొద్దున్న ఒకామె ఎవరో అడిగిందికదా, ఆ ఎందుకు ముక్తి ఉంటే చాలు కదా! ఆ స్థితిలోనే ఉండేవాడిని నేను శ్రీరామశర్మ ఆచార్య దగ్గరకి రానంత వరకు.

అంచేత ఆసన ప్రాణాయామాలు గురించి నేను విశేషంగా పట్టించుకోలేదు. దాని విలువ రెండేళ్ళ క్రిందట నేను పెర్సనల్‌గా చూసిన తరవాత, మీకు అందరికీ ఆ సంఘటనలు తెలుసును కనుక దాని గురించి నేను మాట్లాడటం లేదు. జిందల్‌లో నేచర్ క్యూర్ హాస్పిటల్‌లో నేనున్నప్పుడు 180 కేజీల ఒక వ్యక్తి వచ్చాడు అక్కడకి. 180 కేజీలు అంటే మీకు అవగాహన ఉందా ఎలా ఉంటాడో అతను. ఆరు, ఆరున్నర అడుగుల ఎత్తు మనిషి, రాజస్తానీ,

కోటీశ్వరుడు. అతనికి ఒకే ఒక బాధ ఏమిటంటే, మోకాలి నొప్పి. మిగతా డయాబెటిస్, బి.పీ. అవేం లేవు అన్ని కేజీలు బరువున్నా.

జిందల్‌లో నేను జేరిన నెక్స్‌ట్ డే అతను జేరాడు. అతని రూమ్ నా ప్రక్క రూమే. మాట్లాడుకుంటున్నాం, "ఆసనాలు వెయ్యాల్సిందే మీరు అన్నారండి, అందులో పద్మాసనం వెయ్యాలన్నారు నన్ను". అసలు గొడవేమిటి, 180 కేజీలు ఉన్నటువంటి వ్యక్తి కాలు ఎలా ఉంటుందో మీకు ఐడియా ఉందికదా! ఆ కాలు మడత పెట్టాలి. 60 ఏళ్ళ వాడు. అందులో ఇంకొకటేమిటి, మోకాలి నొప్పి. కాలు వంగటం లేదు, అసలు వచ్చింది అందుకు.

వీళ్ళు ఊరుకోరుగా, నువ్వు ఆసనాలు వెయ్యాల్సిందే అన్నారు. 21 వ రోజు పద్మాసనం వేశాడతను. చేయదల్చుకుంటే, అసంభవం అనుకున్నటువంటిది సంభవం అవుతుంది.

❋ అలాంటిది, భారతదేశంలో పుట్టినటువంటి మనము, ఎన్ని జన్మల బట్టి ఈ ఆసనాలు, ప్రాణాయామాలు చేస్తూవుంటే అంత అద్భుతమైన గురువు మనకు దొరికాడో తెలియదు. ఇవంతా మనకు కొట్టినపిండే అయివుంటుందని నా నమ్మకం.

**ఎంచేతంటే,**

ఆసనాలు, ప్రాణాయామాలకు ప్రాముఖ్యత ఇవ్వలేదని నేను చెప్పానుకదా. నేనక్కడ వాళ్ళు చెప్పినట్టు ఆసనాలు వేస్తూవుంటే వాళ్ళు అడిగారు, "మీరు చిన్నప్పటి నుంచి ఆసనాలు వేస్తున్నారా మాస్టారు!" అని. నేనేం చెప్పలేదు వాళ్ళకి. కానీ మనసులో అను



కున్నాను, చిన్నప్పటి నుంచి ఏమిటి, అసలు ఎప్పుడూ నా జన్మలో వేయలేదు ఆసనాలు, ఇక్కడకి వచ్చాకే వేశాను అని.

- అంటే మన కర్మ, ఉత్తినే అకారణంగా మీరు ఇక్కడకి వచ్చారని అనుకోవద్దు. మీరంతా కారణజన్ములే.

మీరు ఏ స్థితిలో ఉన్నారో అది వదిలేయండి. రైదాసు చెప్పులు కుట్టుకునేవాడు. కబీరుదాసు బట్టలు అల్లుకునేవాడు. ఆ రోజు బట్టలు అల్లుకుని అమ్మితే తప్ప ఆయనకి తిండి ఉండేదికాదు. రైదాసుకు ఆ రోజు చెప్పులు కుట్టుకుంటేకాని తిండి ఉండేదికాదు. కానీ రైదాసుకి మీరాబాయి శిష్యురాలు, ఈవిడ రాజకుమార్తె.

- అంచేత ఆధ్యాత్మిక జగత్తులో మీరు ఉన్నటువంటి భౌతిక స్థాయికి ప్రాముఖ్యత లేదు.

అనేక రకరకాలైనటువంటి కారణాల వల్ల ఫలానా ఫలానా భౌతికస్థాయిలో ఫలానా ఫలానా స్త్రీ, పురుషుల శరీరంలో మనం ఉంటాం. అది ముఖ్యం కాదు. మీ ఆరోగ్యం ముఖ్యంకాదు.

మీరు ఏ పరిస్థితిల్లో ఉన్నా కూడా అందులో చెప్పినటువంటి ఆసనాలు మీరు వెయ్యగలుగుతారు. మొదటి కండిషను అది. ఎంత తొందరగా మీరు మొదలెట్టగలిగితే అంత తొందరగా మొదలెట్టే యండి. ఇక్కడ మాత్రం నేను తక్షణమే అనను.

మెల్లిగా క్రమపద్ధతిలో ఆసనాలు వెయ్యాలితప్ప, మాస్టారు ఆసనాలు వెయ్యమన్నారని చెప్పి ఇప్పుడు అయిపోగానే మీరు ఆసనాలు వెయ్యటం మొదలెడితే చాలా ప్రమాదాలు వస్తాయి.



పద్ధతి ప్రకారం చెయ్యండి. కానీ, శరీరాన్ని లొంగదియ్యండి. రోజూ ప్రాక్టీస్ చేసుకుంటూ, చేసుకుంటూ 21 వ రోజు ఆయన పద్మాసనం వేశాడని చెప్పానుకదా! అంచేత ఆసనాలు అవీ మీరు ఇళ్ళల్లో చేసు కుంటూ ఉన్నప్పుడు ఒంటరిగా చేసుకోవద్దు, పదిమందితో కలిసి చేసుకున్నప్పుడు నెమ్మదిగా చేసుకోగలుగుతారు.

**ఎప్పుడూ కూడా ఒకటి గుర్తుంచుకోండి,**

ఆసనాలు ఒంటరిగా వెయ్యటంకంటే, పదిమందితో కలిసి వేస్తేనే ఫలితాలు ఎక్కువ వస్తాయన్నది జిందల్‌లో నేచర్ క్యూర్ హాస్పిటల్‌లో రీసెర్చ్ చేసి కనిపెట్టారు వాళ్ళు. ఆసనాలు గదుల్లో వేయించేవారు, బయట అందరూ కలిసి వేసేవారు. గదుల్లో వేసుకున్న వాళ్ళకంటే బయట వేసిన వాళ్ళకి 80 శాతం ఎక్కువ తొందరగా ఫలితాలు వచ్చాయట.

ఇది నేనేం కళ్ళారా చూడలేదు, వాళ్ళు చెప్పింది చెప్తున్నాను. వాళ్ళేం అబద్ధాలు చెప్పరుకదా! అంచేత మీరు ఆసనాలు వేయదల్చు కున్నవాళ్ళు కలిసి వేసుకోండి. కనీసం చుట్టుప్రక్కల ఉన్నటువంటి ఇళ్ళ వాళ్ళు, ఆ పేటలో ఉన్నటువంటి వాళ్ళు కలిసి వేసుకోండి.

అంచేత ఆసనాలు మీ జీవితంలో ఒక భాగమైపోవాలి. ముఖ్యంగా ఈ మాటలు వింటోన్నటువంటి వాళ్ళకి మాత్రం ఒక భాగమైపోవాలి. మీరు చెప్తోన్నటువంటి వాళ్ళకి అది భాగమయ్యేటట్టు చూడండి. పాయింట్ అర్థమయిందికదా! లేవగానే పళ్ళు ఎలా తోము కుంటామో, తల ఎలా దువ్వుకుంటామో, ఉతికిన బట్టలు ఎలా కట్టుకుంటామో, స్నానం ఎలా చేస్తామో, ఆహారం ఎలా తీసు



కుంటామో, అలాగే ఆసనాలు కూడా వెయ్యాలి. అంతేతప్ప, ఇవాళ నాకు కొంచెం బద్ధకంగా ఉంది మాస్టారు, ఆసనాలు వెయ్యలేను అనొద్దు. అది మీ జీవితంలో ఒక భాగంగా మారిపోవాలి. కొంచెం మంకు పట్టుదల పెట్టుకుంటే వచ్చేస్తుంది.

**రెండవది మీరు చేయవలసింది ఏమిటంటే,**

ప్రాణాయామం. ఈ ప్రాణాయామం కూడా గాయత్రీ మహావిజ్ఞాన్ మూడవ భాగంలో ఏ ప్రాణాయామాలు చెయ్యాలో ఆయన వ్రాశారు. మీకు నచ్చిన ఏదో ఒక ప్రాణాయామాన్ని ప్రాక్టీస్‌లో పెట్టుకోండి. అన్ని ప్రాణాయామాలు చెయ్యకండి. ఏదో ఒకటి. అది ఆయన వ్రాసినటువంటి పుస్తకంలో వ్రాసిన ఏ ప్రాణాయామం అయినా మీరు నిస్సంకోచకంగా చెయ్యొచ్చు.

**ఎంచేతంటే,**

అది మీ వారసత్వపు హక్కు కనుక. దాని వల్ల కచ్చితంగా ఆయన వీలునామాలోని అది చేస్తే వచ్చేటటువంటి ఫలితాలు మీకు వస్తాయి. అంచేత ఆసనాలు, రెండవది, ప్రాణాయామం.

**ఇది కాకుండా,**

జపము అనేటటువంటి దాన్ని ఒక పద్ధతిగా చేయటం నేర్చుకోండి. చేస్తున్నాం మనం మంత్రజపం. కానీ మంత్రజపం చేస్తోన్నప్పుడు ఒక పద్ధతిలో మీకు నచ్చినటువంటి స్వరంలో సామూహికంగా చేయటం నేర్చుకోండి. సామూహికంగా చేసే మంత్రజపంతో ఒంటరిగా చేసే మంత్రజపంకంటే చాలా ఎక్కువ ఫలితాలు వస్తాయి.



రాక్షసులు ఎప్పుడూ కూడా ఒంటరిగానే తపస్సులు చేశారు. తపస్సులు చేశారు, రాక్షసులు అన్పించుకున్నారు. ఋషులెప్పుడూ కూడా సామూహికమే. గురుకులం ఉండేది. గురుకులంలో శిష్యులతో పాటు కలిసి వాళ్ళు సంధ్యావందనాలు అవీ వాళ్ళకి నేర్పుతూ కలిసి చేస్తుండేవారు. పూర్వకాలంలో దేవాలయాలు అందుకు ఉండేవి. దేవాలయాలలో ఆ దేవత యొక్క మంత్రజపము సామూహికంగా ఆ పేటలో ఉండే వాళ్ళు చేసుకుంటూ ఉండేవారు.

మరి ఈ కాలంలో దేవాలయాల్లో అలాంటి వాతావరణం మనం తీసుకురాలేం. మనం మంత్రజపం చేస్తుంటే వాళ్ళు ఠంగ్ ఠంగ్ ఠంగ్ అని గంట కొట్టేస్తూవుంటారు. ప్రక్కకు జరుగు, ప్రక్కకు జరుగు అంటూవుంటారు. మనం కళ్ళు మూసుకుని కూర్చుంటే వీడెవడు కళ్ళు మూసుకుని కూర్చున్నాడు అని తేరిపార చూస్తారు. అంచేత మనం అనుగ్రహ పీఠాలు పెట్టుకుంటాం. అంతకంటే మనం చేయగలిగేముంది మరి? రాబోయే రోజుల్లో దేవాలయాలు ఇప్పుడు నేను చెప్తోన్నటువంటి దానిగా మారవచ్చు.

అంచేత నా కోరిక ఏమిటో అర్థమయిపోయిందికదా! పేట పేటలో, ఊరు ఊరులో సామూహిక గాయత్రీ మంత్ర జప పరంపర నడవాలి. ఎలా చేసుకుంటాం అన్నది ముందు మనం చేసుకుంటూ వుంటే, మనల్ని చూసి మిగతా వాళ్ళు చేసుకుంటారు. అంతే తప్ప నువ్వు చేసుకో అని చెప్పి మనం చేయటం మానేయకూడదు. మంత్ర జపం మూడవది. ఆసనము, ప్రాణాయామము, మంత్రజపము. ఈ మూడూ కూడా మన జీవితాల్లో అభిన్న అంగంగా మారిపోవాలి.

**ఇదంతా చేస్తూవుంటే చివరికి మీరు ఏ స్థితికి వెళతారంటే,**

ధ్యానస్థితికి వెళతారు.

ఆ ధ్యానస్థితికి ఎలా వెళ్ళాలో ఇవాళ పూర్ణిమ కనుక పూర్ణిమా ధ్యానము నేర్చుకుంటూ ధ్యానస్థితికి వెళ్ళిపోదాం. ధ్యానం అయిపోయాక భోజనం చేద్దాం. భోజనం చేశాక ధ్యానం మనం చేస్తాంకాని, ఆ ధ్యానము ఇంకో రకమైన ధ్యానంగా మారిపోయే ప్రమాదం ఉంది, నిద్రావస్థకి వెళ్ళిపోతాం. ముందు భోంచేశాకే చేద్దాం అన్నాన్నేను. కానీ తరవాత ఇదేదో బావుండదని నాకే అనుమానం వచ్చింది. అంచేత కాస్త ధ్యానం చేసుకుందాం.

✦ ఈ ధ్యానము అనేది ఆసన, ప్రాణాయామ, జపము యొక్క పరిణతి. రిజల్ట్. ఈ మూడూ చేస్తున్నటువంటి వాళ్ళే ధ్యానస్థితికి వెళ్ళగలరు. మిగతావాళ్ళు మహానటులు. మేం ధ్యానం చేస్తున్నాం అనుకుంటారుకాని, వాళ్ళు ధ్యానం చేయలేరు.

అంచేత ఆసనాలు వేయటంలేదు, ప్రాణాయామాలు చేయటంలేదు, జపం చేయటంలేదు, కానీ ధ్యానం చేస్తాం అంటు న్నాడు, కచ్చితంగా వాడిని వాడు మోసగించుకుంటున్నాడు. ఇది వద్దు అనేటటువంటి వాళ్ళు ఇంకా ప్రమాదకరమైనటువంటి పరిస్థితుల్లో పడతారు. అంచేత వాటిని మానకండి.

పూర్ణిమా ధ్యానం చేయబోయే ముందు ఇప్పుడు నేను 15 నిమిషాలు బ్రేక్ ఇస్తున్నాను. కరెక్ట్‌గా 9.30కి రండి.

స్వస్తి.



ఓం ............... ఓం .............. ఓం ..............

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మః తస్మై శ్రీగురవేనమః

అఖండమండలాకారం వ్యాప్తంయేన చరాచరమ్
యత్పదం దర్శితంయేన తస్మై శ్రీగురవేనమః

---

ధ్యానం గురించి కొన్ని విశేషమైన సూచనలు జాగ్రత్తగా గమనించుకోండి.

✦ 12 రకాల ధ్యానాలు మనం చేయాల్సి వస్తుంది. ప్రతీ పూర్ణిమకు ఒక ధ్యానము, సంవత్సరానికి 12 పూర్ణిమలు వస్తాయి. ఈ 12 పూర్ణిమలలో మనం చేసేటటువంటి ధ్యానము 12 రకాలుగా ఉంటుంది. ఇది అవగాహన చేసుకోండి.

☝ నేల మీద కూర్చోవద్దు. ఈ మొదటి నియమాన్ని మీరు గుర్తుంచుకోండి. ఎప్పుడు మీరు ధ్యానం చేయదల్చుకున్నా కచ్చితంగా నేల మీద ఏదో ఒకటి పరుచుకుని చేయండి.

ఓం ............... ఓం ............... ఓం ...............

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మః తస్మై శ్రీగురవేనమః

అఖండమండలాకారం వ్యాప్తంయేన చరాచరమ్
యత్పదం దర్శితంయేన తస్మై శ్రీగురవేనమః

♠ ఉగాది, యుగాది. ఆధ్యాత్మిక జీవిత కాలంలో ఒక సంవత్సరం ఒక యుగానికి సమానము. చాలా జాగ్రత్తగా మీరు ఈ రహస్యం అర్థం చేసుకోండి.

✦ యుగపరివర్తన అని గురుదేవులు చెప్పినటువంటి మాటలో అనేక లోతైనటువంటి అర్థాలు ఉన్నాయి.

♠ మీరు ధ్యానం చేస్తూ కూర్చున్నప్పుడు మీరు అరగంట సేపు ధ్యానానికి కూర్చుంటే మీ జీవితంలో 30 సంవత్సరాల మార్పు వస్తుంది. ఈ రహస్యాన్ని కూడా గుర్తుంచుకోండి.

మెల్లిమెల్లిగా మీకు నేను చెప్పినటువంటి మాటలు అర్థమవుతాయి. మీరు ధ్యానానికి కూర్చునేటప్పుడు చాలా జాగ్రత్తగా ఇది మళ్ళీ మళ్ళీ గుర్తుచేసుకోండి.

వీలయితే కేసెట్‌లోని ఈ భాగాన్ని మీరు కేసెట్ అయినా చేసేసుకోండి, లేకపోతే వ్రాసేసుకోండి. ఎక్కువ సూచనలేం ఉండవు, కానీ విషయం మీకు గుర్తుండాలి.

ఒక నిమిషము = ఒక సంవత్సరం.



**అంటే ధ్యానం చేస్తున్న వాడి యొక్క ప్రగతి ఎలా ఉంటుందంటే,**

✦ మీరు రోజుకి 30 నిమిషాలు ధ్యానం చేస్తూవుంటే, ప్రతీ రోజు మీరు మిగతా వాళ్ళ కంటే 30 సంవత్సరాలు ముందుకు వెళతారు.

➡ మీకు వెళుతోన్నట్టు అన్పించలేదు అంటే కారణం ఏమిటంటే, మీ దృష్టి దాని మీద లేకపోవటం వల్ల. ధ్యానంలో మీరు దీన్ని గమనించుకోవాలి అని తెలియటంలేదు మీకు.

⇨ పరిణామక్రమములో ఖనిజ జగత్తు నుంచి వృక్షజగత్తుకు రావటానికి కొన్ని కోట్లాది సంవత్సరాలు పడుతుంది.

⇨ వృక్షజగత్తు నుంచి జంతు జగత్తుకు రావటానికి ఇంకొన్ని కోట్లాది సంవత్సరాలు పడతాయి.

⇨ కోట్ల కోట్ల కోట్ల కోట్ల సంవత్సరాలలో పరిణామము వస్తూ వుంటుంది. ఆ పరిణామాన్ని మీరు తొందరగా మార్చలేరు.

ఖనిజస్థాయిలో ఉన్నటువంటి పదార్థము వృక్షస్థాయిలోకి వెళ్ళాలంటే కోట్లాది సంవత్సరాలు పట్టాల్సిందే. తొందరేం చేయలేరు మీరు. వృక్షజగత్తులో ఉన్నటువంటి చేతనత్వము జంతుస్థాయిలోకి వెళ్ళాలంటే మళ్ళీ కోట్లాది కోట్ల సంవత్సరాలు పడతాయి.

✦ అంచేత మనమందరము కూడా కొన్ని కోట్లాది కోట్లాది సంవత్సరాలు తరవాత మానవ శరీరధారులుగా పుట్టాము అన్నది అవగాహన అయిందికదా మీకు. మానవుడు కూడా జంతువే.



♣ కానీ మానవ శరీరధారి అనే జంతువుగా పుట్టటము అద్భుత మైనటువంటి అదృష్టం.

**ఎంచేత?**

జంతుస్థాయి నుంచి దేవతల స్థాయికి వెళ్ళటానికి మళ్ళీ మీకు కోట్లాది సంవత్సరాలు పడతాయి.

కానీ మానవశరీరధారి అయినటువంటి జంతువుకు
5 సంవత్సరాలు చాలు.
అది అద్భుతం ఉపయోగించుకోగలిగితే.

**ఎలా ఉపయోగించుకోగలం అంటే,**

ధ్యానము వల్ల మాత్రమే
మీరు దాన్ని ఉపయోగించుకోగలరు.

✤ అంచేత ఇందాక నేను చెప్పిన గాయత్రీ మంత్రము, యజ్ఞము, ఆసనాలు, ప్రాణాయామము, జపము ఇవన్నీ ధ్యానంలో మీరు తొందర తొందరగా పరిణామక్రమాన్ని చాలించుకుని,

5 సంవత్సరాలలో కొన్ని కోట్ల సంవత్సరాల పరిణామక్రమం దాటి వేయటానికి చేసే ప్రయత్నము అని గుర్తుంచుకోండి.

అది మీకు ఎవరూ చెప్పలేదు కనుక మీరు ధ్యానం చేస్తున్నా మీకు ఏ ఫలితమూ రావటం లేదు.

♠ మీరు ఉత్తినే కళ్ళు మూసుకుని కూర్చున్నా కచ్చితంగా కొన్ని సంవత్సరాలు ముందుకెళ్ళిపోతారు. తెలిస్తే.

